# వైశంపాయనుఁడు

( మాయచిలుక )



ఉభయభాషాప్రవీణ, శ్రీమాన్

కో. వేం. కృష్ణమాచార్యులు



లీలాప్రెస్, విజయవాడ-2.

**1957**

## మహాకవి భట్టబాణుని కల్పిత వ్యక్తులు

| | |
|---|---|
| చిలుక | ... ... |
| వైశంపాయనుడు | మంత్రిపుత్రుడు |
| పుండరీకుడు | మునిబాలుడు |
| కపింజలుడు | పుండరీకుని మిత్రుడు |
| ఇంద్రాయుధము | చంద్రాపీడుని గుఱ్ఱము |
| శూద్రకుడు | విదిశాపురమునకు రాజు |
| చంద్రాపీడుడు | ఉజ్జయిని యువరాజు |
| చంద్రుడు | ... ... |
| పత్రలేఖ | చంద్రాపీడుని అడపకత్తె |
| మహాశ్వేత | పుండరీకుని ప్రణయిని |
| కాదంబరి | చంద్రాపీడుని ప్రణయిని |
| తారాపీడుడు | చంద్రాపీడుని తండ్రి |
| విలాసవతి | చంద్రాపీడుని తల్లి |
| శుకనాసుడు | వైశంపాయనుని తండ్రి |
| మనోరమ | వైశంపాయనుని తల్లి |
| తరళిక | మహాశ్వేత చెలికత్తె |
| మదలేఖ | కాదంబరి సఖి |

ఇంకను గంచుకులు మొదలగువారు కలరు.

# వైశంపాయనుఁడు

## (మాయచిలుక)

పూర్వకాలమున శూద్రకుఁడను రాజొకఁడు కలఁడు. ఆతఁడు విదిశాపురము రాజధానిగాఁ బ్రజలఁ బరిపాలించెను. ఆతనిమంత్రులు న్యాయదక్షులు – సాధుశీలురు. ఆతఁడు దుష్టశిక్షకుఁడు – శిష్టరక్షకుఁడు. ఆతనిరాజ్యము రామరాజ్యము. శాంతిసౌఖ్యములతోఁ బ్రజలు సుఖముగానుండిరి.

ఆతఁడు వీరుఁడు. శత్రుబాధను నివారించెను. విజయపతాకముల నెత్తించెను. సమస్తసౌఖ్యములతో నలరారెను. కాని యాతఁడు నవయౌవనముననున్నను వివాహమాడలేదు. సంతతిని గాంచలేదు. ప్రజలాతని బ్రార్థించిరి. మంత్రులు మందలించిరి. ఎవ రేమిచేసిన నేమి? ఆతఁడు పెండ్లియాడలేదు.

ఒకనాఁ డాతడు సభతీర్చియుండెను. మంత్రిసామంతులును, బ్రజాప్రతినిధులును, దమతమస్థానముల నుపవేశించియుండిరి. ద్వారపాలిక వచ్చినది. మోకరించి చేతులుజోడించి 'ప్రభూ! దక్షిణాపథమునుండి యొకచండాలకన్యక వచ్చినది. ఆమెచేతిలోఁ బంజర మున్నది. అందొకచిలుకకలదు, ఆచిలుక మిక్కిలివింతయైనఁదట! దానిని దేవర కర్పింపఁదలచినఁదట! ఆజ్ఞయే!' అనినది. రాజునకును కుతూహలము కల్గినది. 'తప్పేమి? ప్రవేశపెట్టు' మని యాతఁడు సామంతులమొగము చూచుచుఁ బలికినాఁడు.

ప్రతీహారి మాతంగకన్యను గొనివచ్చినది. ఆమె కిరువ దేండ్లవయ స్సుండును. రూపము మనోహరము. మోకాళ్ళ వఱకు వ్రేలుచున్నరవికను దొడిగి యెఱ్ఱనిముసుఁగును వేసి కొనినది. ఆమెముం దొక ముదుసలి కలఁడు. అతని కేఁబది యేం డ్లుండును. తలనెఱిసినది. శరీరము సుదృఢము. మాపుల లో శాంతి యుట్టిపడుచున్నది. ఆమెవెనుక నొక బాలుఁడు కలఁడు. వానిచేతిలోఁ బంజర మున్నది. ఆమె సభలో ప్రవేశిం పఁగనే యొకపఱి తన చేతికఱ్ఱను నేలపైఁ గొట్టినది. రాజాదు లామెకై చూచిరి. ఆమె వారికి మ్రొక్కి నేలపైఁ గూరుచుండి నది. బాలుఁడు పంజరమును ముదుసలికందించినాఁడు. 'ప్రభూ! ఈచిలుకకు శాస్త్రములు వచ్చును – చతుష్షష్టికళలు తెలి యును– రాజనీతి తెలియును. తెలియనిది లేదు. దీని పేరు వైశంపాయనుఁడు. ప్రభువునకు దీని నర్పింప మా ప్రభుపుత్రి తీసికొని వచ్చినది' అని యాచిలుకను జూపుచు మాదుసలి పలికి పంజరమును రాజుముం దుంచినాఁడు.

వైశంపాయనుఁడు రాజుకై మఱలి కుడికాలినెత్తి జయ జయధ్వని నొనర్చినాడు. ఆతఁడు కవి. ఇట్లు చదివినాడు.

'అనఘా! నీ శత్రువధూ
స్తనయుగి కన్నీట దోఁగి సంతాపాగ్నిం
గనలి విముక్తాహారత
నొనరించు వ్రతమ్ము గాననోర్వెం గనుమా!'

రాజున కాశ్చర్యము కలిగినది. అతఁడు తనమంత్రి కుమారపాలితునితో "ఏంటిరా? ఈ చిలుకపలుకు లమ్మ

తప్పుఁబలుకులు. జంతువులకింతవిజ్ఞానముండదే! ఇది యే మహా
నీయుని యవతారమో!" అనినాఁడు. కుమారపాలితుఁడు,
"రాజా! ఇందు వింతయేమి కలదు? చెప్పినదానిని జిలుకలు
పలుకును. మఱియుఁ బక్షులును మానవులవలెనే పూర్వము
పలికెడివఁట. అగ్ని శపించుటచే నస్ఫుటవాక్కు కలిగెనఁట!"
అని చెప్పినాఁడు. ఇంతలో మధ్యాహ్న శంఖధ్వని వినిపించి
నది. సభ ముఁగిసినది. మంత్రి సామంతాదులు తమతమ
యిండ్ల కేగిరి. చండాల కన్యకను 'విశ్రమింపు' మని తెల్పి
వైశంపాయనుని లోపలికిఁ గొనిరమ్ము. స్నాన పానాదుల
నిర్వర్తింపుమని యడపకత్తెకుఁజెప్పి రా జంతఃపురమున కరిగి
స్నాన పానాదుల నిర్వర్తించెను.

రాజాదుల భోజనము లయినపిదప రా జాస్థానమండపము
నకు వచ్చినాఁడు. మిత్రులు కొందఱు ఆతని ననుగమించిరి.
ఆతఁ డింక శయనించి మిత్రులతో ముచ్చటలాడుచుఁ బ్రతీహారి
నంపి వైశంపాయనుని దెప్పించెను. 'హాయిగా భుజించితి'
నని వైశంపాయనుఁడు తెలిపెను.

రాజు వైశంపాయనుని జూచి "మంచిది. కాని నీ వెవ
రవో! నీ తల్లిదండ్రు లెవరో? నీ వెచట జన్మించితివో? నీ
కె ట్లింతవిజ్ఞానము కలిగెనో! నీ కెట్లుపూర్వజన్మ జ్ఞానము కలి
గినదో? నీ వేల పంజరమునఁబడితివో? మాకుఁ దెలుపు?"మని
ప్రశ్నించెను.

వైశంపాయనుఁడు "రాజా! నాదొక పెద్ద భారతము!
వినవలెనని యున్న వినవచ్చును" అని యిట్లు చెప్పెను.

దక్షిణాపథమున వింధ్య మను పర్వతము కలదు. రాముం డచటనే పర్ణశాలను గట్టికొని నివసించెను. అచటనే యగస్త్యాశ్రమము కలదు. ఆ యాశ్రమమునకుం గొలంది దూరమునం 'బంపా సర' స్సున్నది. ఆ సరస్సు పడమటి గట్టున నొక బూరుగుచెట్టున్నది. ఆ చెట్టుపైం గొమ్మలలోం గోటరములలోం - బక్షులు గూండ్లు కట్టుకొని నివసించు చుండును. పగ లెఱకై పోవును. పిల్లలకుంబెట్టి తాము తినును. రాత్రులు గూండ్లలోం బండుకొనును. నాతండ్రియు నా చెట్టు తొఱ్ఱలో నొకచో నివసించును. ఆతండు ముదుసలి. కదలలేండు. మెదలలేండు. ఆదశలో నాతనికి నేను జన్మించితిని. నాతల్లి నేను జన్మింపంగానే పరలోకమునకుం బోయినది. నాతండ్రియే నాకుం దల్లి. ఆతండే నన్నుం బెంచెడివాండు. పక్షులనోటినుండి జారిపడిన గింజల నేరి తెచ్చెడివాండు. నా నోటిలోం బెట్టెడి వాండు. నా కడుపు నిండిన నాతనికడుపు నిండినట్లే! మిగిలిన యొకటి రెండు గింజలం గొరికెడివాండు.

ఒకనాండు తెల తెలవాఱుచున్నది. చంద్రుండ స్తమించి నాండు. జంతువుల కలకలములు, అడవిపందుల గురగురలు, సింహములగర్జనలు, ఏనుగులఘీంకారములు అడవియంతయుం బ్రతిధ్వనించుచున్నది.

నాకు భయము పుట్టినది. తండ్రిఱెక్కలలో దూరితిని. కేకలు వినబడినవి. బొబ్బలు వినంబడినవి. కొలందిసేపటి కా గోల శాంతించినది! నాకు భయముపోయినది, తలనెత్తి చూచి తిని, శబరసైన్యము కాన్పించినది. వారినాయకుండు కాన్పిం

చినాఁడు. ఆతఁడు మా చెట్టునీడనే విశ్రమించి తామరకాడల
మ్రింగి సేనలతో బయలుదేరినాఁడు.

మా వార్త మంచిది కాదు. ఒకముదుసలిబోయ యా చెట్టుకడ నిలిచినాఁడు. పైకిఁజూచినాఁడు. ఆతనిపంటపండినది. చెట్టుపై కెక్కినాఁడు. పక్షిపిల్లలమెడలు విఱిచినాఁడు. నేలపైఁ బాఱవైచినాఁడు.

నాతండ్రి కొడలు వడఁకినది. నాలుక యెండినది. ఆలో చన తోఁచలేదు. మరణము తప్పదు. అయిన నాపై మమకారము మానలేదు. తన ఱెక్కలలోఁగనపడకుండ నన్నుఁ గప్పినాఁడు. బెదరుచూపులఁ జూచుచున్నాఁడు. ఇంతలో మృత్యుదేవత వచ్చినది. నాతండ్రి తెపతెప కొట్టుకొనినాఁడు. ముక్కుతోఁ బొడిచినాఁడు. ఏమైన నేమి? బోయ యాతని మెడయు విఱిచినాఁడు. నేలపై వైచినాఁడు. నే నాతని ఱెక్కల నుండి జారి నేలపైఁబడితిని. నా కనుభవమున్నది. ఆయుర్దాయ మున్నది. నే నాకులపైఁబడితిని. వాఁడు చెట్టుదిగి వచ్చు నప్పటికిఁ జల్లగా జారితిని. పొరలితిని. ఎగిరితిని. మెల్లగా నెట్లో కొలఁదిదూరముగడచి చమాలవృక్షమును జేరితిని. ఆ బోయ యా పక్షిపిల్లల నొకయాకులోఁబెట్టి తీఁగనుజుట్టి యింటికి గొని పోయెను.

వాఁడు పోయెనని నేను నిశ్చయించుకొంటిని. అంతలో నాగొంతెండినది. ఆఁకలివైచినది. చెట్టుకడనుండి కదలితిని. సరస్సులో దిగితిని. చచ్చుట మంచిదని తలఁచితిని. అయిన

నేమి? జీవితాశ నన్ను వదలలేదు. నీరు త్రాఁగితిని. మఱల నొడ్డునకు రావలయును. నాకు ఱెక్కలు లేవు. నడచుటకు శక్తిలేదు.

విధివిలాసము విచిత్రము. ఆ సరస్సులో స్నానము చేయఁ గొందఱు మునిబాలురు వచ్చిరి. అం దొకఁడు వారికి గురుపుత్రుఁడు ఆతఁడు నన్నుఁ జూచెను. నా యవస్థను జూచెను. కనికరము కలిగినది. నను( బట్టికొని చేతిలోనుంచు కొని యాశ్రమమున కరిగినాఁడు.

ఆ బాలుఁడు మహర్షి జాబాలికుమారుఁ డఁట! హారీతుఁ డాతని పేరఁట. ఆతఁడు నన్నుఁ దీసికొనిపోయి యొక యశోకతరువునీడను నిలిపెను. తండ్రి పాదములపైఁ బడి నమస్కరించెను. ఆతనికడ దర్భాసనముపైఁ గూర్చుండెను. మునులు నన్నుఁ జూచిరి. "ఎక్కడి దీ పక్షిపిల్ల? ఎట్లుదొరికిన" దని యడిగిరి. హారీతుఁడు నావృత్తాంతమును దెల్పినాఁడు.

జాబాలి దివ్యదృష్టిని నాపైఁ బ్రసరించినాఁడు. 'ఎవరి పాపమును వా రనుభవింపక తప్పదు. ఈతఁడు తనపాపమునే తా ననుభవించుచున్నాఁ'డని పలికినాఁడు. మునులకాశ్చర్యము కలిగినది. హారీతుని యాశ్చర్యమున కంతే లేదు. ఆతఁడు తండ్రిని బ్రశ్నించినాఁడు.

"చెప్పవలసినది చాలా యున్నది. దీని నీపక్షియు విన వలయును. దానిచే నితనికిఁ బూర్వజన్మ స్మరణము కలుగును. సర్వవిద్యలును వచ్చును. ఇప్పుడు సాయంకాలము

కావచ్చినది. భోజనానంతరము వినవచ్చు" నని జాబాలి పలికెను.

భోజనము లయినవి. హారీతుఁడు తన ప్రక్కగాఁ గుశాసనముపైనన్నుఁ గూరుచుండఁబెట్టికొనెను. పండువెన్నెల. జాబాలి నన్నుఁ గనికరముతో జూఁచుచు నిట్లు పలికెను.

## 2

అవంతీ దేశమున నుజ్జయిని యను నగరము గలదు. అచటనే శిప్రానది ప్రవహించును. మహాకాలుఁ డను పేర నట నీశ్వరుఁడు నివసించును. ఆపట్టణమునకు రాజు తారాపీడుఁడు. ఆతఁడు ధర్మాత్ముఁడు, ప్రజారంజకుఁడు, శత్రుభీషణుఁడు. ఆతని పట్టమహిషి విలాసవతి. ఆతనిమంత్రి శుకనాసుఁ డను బ్రాహ్మణుఁడు. రాజనీతివిశారదుఁడు. విజ్ఞానవంతుఁడు. మహావీరుఁడు. ఆతనిపత్ని మనోరమ. తారాపీడుఁడు రాజ్యభారమును మంత్రిపైనుంచి హాయిగా యౌవనసుఖముల ననుభవించుచుండెను. ఆతఁ డనుభవింపని యానందమే లేదు. ఉన్న దొక్కటే! కుమారుఁడు లేకపోవుటయే!!

ఆతని పట్టమహిషి విలాసవతి యొకనాఁడు పట్టెమంచముపైఁగూరుచుండి కన్నీరునించుచుండెను. దానిని రాజు చూచెను. పరిజనులను ప్రశ్నించెను. మకరిక రాణిగారియొడపకత్తె. ఆమె "ప్రభూ! రాణి నేఁడు మహాకాలునిగుడి కేఁగినది. అచట భారతమును జదువుచుండిరి. 'సుతులు లేనివారికి

గతులులే'వని యతఁడు చదివెనఁట. అమ్మగా రప్పటినుండి యిట్లున్న"దని పలికినది.

రాజు నిట్టూర్పువదలెను. 'దైవనిర్ణయమునకు మానవుఁ డేమిచేయఁగలఁడు? ధైర్యమువహింపుము. నాకుమాత్రము విచారము లేదా? నోములు నోచుదము. వ్రతములు చేయుదము. మహాకాళునిఁ బూజింతము. దైవకృపయున్నఁ దనయుఁడు కల్గు'నని పల్కి యామెకన్నీటిఁదుడిచి యూరడించెను.

రాజు వెడలిపోయినాఁడు. రాణి తనపనులు చేయుచున్నది. వ్రతములు-జపములు, కథలు - కాలక్షేపములు, మంత్రములుతంత్రములు,మందులు-మాకులులోకములోనెన్ని యున్నవో యన్నిటిని జేసినది. ఒకనాఁడు తూరుపు తెలతెల వాఱుచుండ రాజునకుఁ గల వచ్చినది. విలాసవతినోటిలోఁ జంద్రుఁడు ప్రవేశించినాఁడు. రాజా కలను మంత్రి శుకనాసునితోఁ జెప్పినాఁడు. శుకనాసుఁడు సంతోషముతో "కొలఁది దినములలోఁ గొడుకు పుట్టును. సందేహము లేదు. ప్రభూ! మఱొకమాట. నాకు నదేసమయమున నొకస్వప్నము వచ్చినది. మనోరమయొడిలో నొకమహర్షి పుండరీకము నుంచినట్లు కాన్పించినది. తెల్లవాఱుజామున వచ్చిన కలలు తప్పవు. మీకును నాకును సంతతి కలుగు" నని పలికినాఁడు. విలాసవతికి రాజీవార్త తెలిపినాఁడు.

కొలఁదిదినములకే విలాసవతి గర్భమునఁ జంద్రుఁడు ప్రవేశించినాఁడు. నెలలుగడచినవి. శుభదినమున నొక క్షమాఁ

రుఁడు జన్మించినాఁడు. పట్టణమంతయుఁ బండుగే! ఇంతలో మంగళకుఁ డను నొకఁడువచ్చి "మనోరమకుఁ గుమారుఁ"డని పలికెను. రాజుసంతసమునకు మేర లేదు. ఆతఁడు శుకనాసు నింటికిఁ బరుగెత్తెను. బాలునిఁ జూచెను. పదునొకండవనాఁడు బారసాల జరిగినది. రాజు కుమారునకుఁ "జంద్రాపీడుఁ"డని నామకరణము చేసెను. శుకనాసుఁడు తన కుమారునకు "వైశంపాయనుఁ" డని పేరు పెట్టెను.

చంద్రాపీడ - వైశంపాయనులకు విద్యాభ్యాసము చేయు వయస్సు వచ్చినది. రాజు వారికి శిప్రానదీతీరమున నొక పాఠశాలను నిర్మించెను. అం దనేక భవనములు కలవు. కళల కనేకు లుపాధ్యాయులు గలరు. గాంధర్వమునకు-అభినయము నకు- ఆయుధములకు- చిత్రవిద్యకు- ప్రత్యేకోపాధ్యాయులు గలరు. గణితము - కావ్యములు - పురాణములు - లిపులు- దేశభాషలు ప్రత్యేకముగ నేర్పెడివారు కలరు. వారు సర్వ విద్యలలోఁ జాతుర్యమును సంపాదించిరి. ఆటలలోఁ, బాట లలో, అస్త్రశస్త్రాదివిద్యలలో వార•లసమానులు. క్రమముగా వారికి బాల్యము గడచినది. నూనూఁగు మీసములతో నూతనయౌవన మంకురించినది.

రాజుతో నుపాధ్యాయులు విద్య పూర్తియైనదని తెలి పిరి. రాజు వలాహకుఁ డను తనసేనాపతిని బుత్రునిఁ గొనిరాఁ బంపెను. ఆతఁ డుపాధ్యాయునియాజ్ఞచేఁ బాఠశాలలోఁ బ్రవే శించి, బాలునకు మ్రొక్కి, యతనియాజ్ఞచే సమీపమునఁ

గూరుచుండి చేతులు మోడ్చి 'కుమారా! రాజు సెలవిచ్చు చున్నాఁడు-మాకోరికలుతీరినవి. చదువులు నేర్చితివి. సాములు నేర్చితివి. సమస్తకళలనేర్చితివి. అర్థశాస్త్రమునేర్చితివి.ఆయుధ విద్యను నేర్చితివి. యౌవరాజ్యమును వహింపుము. ప్రజలఁ బాలింపుము.ధర్మమును నడిపింపుము.సఖుల సంతోషపెట్టుము. బంధుగులఁ బరిచరింపుము. ఇదిగో! ఇంకొకమాట! పారశీక రాజు మనకొకగుఱ్ఱము నంపినాడు. దానిపే రింద్రాయుధమఁట! ఇదియు నుచ్చైశ్శ్రవమువలె సముద్రమునుండి పుట్టినదఁట. దానిలక్షణములు నుచ్చైశ్శ్రవములక్షణము లొక్కటియేనఁట. దాని నెక్క దయచేయుము. రాజపుత్రులు వేయిమంది నీవెంట రాగలరు.' అని పల్కెను. వలాహకునిమాటలను రాజపుత్రుఁడు వినెను. 'ఇంద్రాయుధమును దీసికొనిరం'డని యతఁడు పలికెను.

ఇంద్రాయుధమును గొనివచ్చిరి. దానిని జూడఁగానే యతని కాశ్చర్యమైనది. రంభ నొకముని గుఱ్ఱమగునట్లు శపించెను. అది శతధన్వుని సేవించుచుండెడిది. అట్లే యిదియు నొకమహాత్ముఁడేమో? శాపముచే నాకడఁ జేరెనేమో?' యని తలంచి దాని నధిష్ఠించుచు 'మహాత్మా! నీ వెవ్వఁడవో నే నెఱుఁగను. తప్పును మన్నింపు' మని తనలోఁ దా ననుకొనెను.

ఇంద్రాయుధ మతనిఁ గ్రీఁగంటఁ జూచినది. కుడిగిట్టచే నేలపైఁ జఱచి సకిలించినది. రాజపుత్రుఁడు దాని నధిష్ఠించినాఁడు. జనుల కానందకరముగఁ బరిజనులతోఁ బట్టణమునఁ

బరిభ్రమించి రాజప్రాసాదమున కేగి యట గుఱ్ఱమునుండి దిగి వైశంపాయనుని చేయి పట్టికొని నగరులోఁ బ్రవేశించినాఁడు. తండ్రినిఁ జూడఁగనే తలవంచి సాగిలి మ్రొక్కినాఁడు. తండ్రి యాతనిఁ గౌఁగిలించికొనినాఁడు. తరువాత తల్లికి మ్రొక్కి శుకనాసునికడకును మనోరమకడకు నేఁగి వారికీ మ్రొక్కినాఁడు. వైశంపాయనుఁ డాతని ననుగమించినాఁడు, అనుకరించినాఁడు.

మఱునాఁ డాతఁడు వేట కేఁగి క్రూరమృగముల వధించి, యింద్రాయుధముతో మిత్రునితోఁ బరివారముతో మఱల గృహమును బ్రవేశించెను. తల్లికడనుండి కైలాసుఁడనుకంచుకి మఱునాఁ డుదయమున నొకవినయవతి యగు యువతితో నేతెంచి, ప్రణమించి, "కుమార! ఈ కన్య మీతండ్రి కులూతదేశమును జయించినప్పుడు తెచ్చినది. కులూతరాజు కూఁతురు. పత్రలేఖ యనిపేరు. నే నీమెను దిక్కులేనిదని తెలిసి కన్నకూఁతునువలెఁ బెంచికొంటిని. ఈమెను నీకడకు క్రొత్తగా నిచ్చుచున్నాను. ఈమె నాదరింపఁ దగును. గౌరవింప నగును. చెల్లెలివలెఁ జూచికొనఁదగు నని యమ్మగారియాజ్ఞ" యని పల్కెను. రాజపుత్రుఁడు తల్లియానతిని శిరసావహించి "చిత్త"మని విన్నవించెను. నాటినుండి యామె యతనికి సోదరి; రెండవ హృదయము.

కాలము గడచుచున్నది. రాజు యౌవరాజ్యాభిషేకము చేయఁదలఁచెను. శుకనాసుఁ డతనికి హిత ముపదేశించెను.

'కుమారా! రాజ్యపరిపాలనము మిక్కిలి దారుణమైనది. రాజు పదవిని గాపాడుకొనవలెను. ప్రజలఁ గాపాడవలెను. పదవికై యతఁడు పరుపాట్లు - పలుకు పలుకులు- చేయు మాయలు- ఆహా! ఆలిని నమ్మరాదు. అనుజుల నమ్మరాదు. అమ్మను నమ్మరాదు. తండ్రి లేఁడు త్రాత లేఁడు. హత్యలు చేయవలెను. అనృతము లాడఁదగును. తండ్రీ! న్యాయమును వీడకుము.' కౌటిల్యునికుటిలనీతినే నమ్మకుము. ప్రజలఁ బాలింపుము. మమ్మానందింపఁ జేయు'మనెను. రాజపుత్రుఁ డాతనియుపదేశముల శిరసా వహించెను.

సుముహూర్తము సమీపించినది. తండ్రి స్వయముగా మంగళ కలశమును వహించెను. శుకనాసుఁ డతని వెంబడించెను. సర్వనదీజలములను పవిత్రతీర్థజలములను సముద్ర జలములను సర్వౌషధులతో- సర్వ రత్నములతో - సకల మంత్రములతోఁ బవిత్రముగఁ జేసి తండ్రి యతని నభిషేకించెను. తల్లి యాతనిశరీరమునఁ దెల్లనిచందన మలఁదెను. తెల్లని వస్త్రముల ధరించి కంకణమును గట్టికొని, రత్నహారములను బుష్పహారములను సవరించి, తండ్రి వేత్రదండమును వహించి ముందునడువ సభామండపమున రత్నసింహాసనము నలంకరించెను. జయ జయా రావములు నిండెను. అధికృతుల వందనముల నందికొని వారల సమ్మానించెను.

# 3

తారాపీడు నియాజ్ఞ యైనది. సేనలుసిద్ధపఱుపఁబడినవి. దిగ్విజయయాత్రకు భేరి మ్రోగింపఁబడినది. రాజపుత్రుడు పత్ర లేఖతో 'కరేణుక' నధిష్ఠించినాఁడు. శ్వేతచ్ఛత్రము వేయఁబడినది. ఇంద్రాయుధ మాతనిముందు కులుకుచు, సకిలించుచు నడచుచున్నది. చతురంగబలము కదలినది. ఇంతలో నతని మిత్రుఁడు, రెండవయువరాజు వైశంపాయనుఁడు 'కరేణుక' నధిష్ఠించి, శ్వేతచ్ఛత్రధారియై వచ్చినాఁడు. మొట్టమొదట వారు తూర్పుదిక్కునకు బయలువెడలిరి. క్రమముగా నాలుగు దిక్కులు జయించి, జయస్తంభముల నాటి స్వదేశమునకు మఱలిరి. కడకుఁ గైలాసపర్వతముకడ, హేమకూటమునొద్ద సముద్రతీరముననున్న 'సువర్ణపుర' మను కిరాతపురమును జయించి స్వాధీనపఱుచుకొనిరి. రాజపుత్రుఁ డచట కొంతకాలము విశ్రాంతికై నిలిచెను. సేనలును వైశంపాయనుఁడు నందే యుండిరి.

చంద్రాపీడుఁ డొకనాఁ డింద్రాయుధము నెక్కి వేటకై బయలువెడలెను. అతనికనులకుఁ గిన్నరమిథునము కానిపించినది. అతని కా వింతవ్యక్తులఁ జూడఁగనే పట్టుకొనవలెనని యాశ కలిగినది. గుఱ్ఱమును బరిగెత్తించినాఁడు. కిన్నర మిథునముకూడ బెదిరినది. దొరికినట్లే కనఁబడినది. కాని దొరకలేదు. గుఱ్ఱము పరుగెత్తుచున్నది. పదునైదు యోజనములు పఱుగెత్తినది. చివర కొక కొండశిఖరముపై కెక్కి

యీ జత మాయ మైనది. కొండపై తాలు జారుచున్నవి. గుఱ్ఱము పసగెత్తలేక పసగెత్తుచున్నది. దానియొడలు చెమటలో మునిఁగిపోయినది. నోటినుండి చొంగపడుచున్నది. చంద్రాపీడుఁడు నల్లే యున్నాఁడు. అతనికిఁ దాను చేసినపనికి విచారము కలిగినది. 'నేనెంత మూఢుఁడను. కిన్నరమిథునము నా కెందుకు? నేను చేయవలసిన పని యేమి? అయ్యో! నే నెంతదూరము వచ్చితిని? ఇంద్రాయుధముపై నెక్కితిని. కిన్నరమిథునముపై నాచూపు. ఎన్ని యోజనములో గడచినవి. సువర్ణపురము మన భారత దేశమున కుత్తరపు సరిహద్దు. దానితరువాత నిర్జనారణ్యము. అవల కైలాసమని కిరాతకులు పలికిరి. ఇది కైలాసమే. ఇఁక నేను దక్షిణమునకుఁ బోవలెను' అని గుఱ్ఱమును మఱలించి, మఱల 'ఎండఎక్కినది. మధ్యాహ్నమైనది. పాపము! ఇంద్రాయుధ మలసినది. కొంచెము గరిక మేసినతరువాత నీరు త్రాగించి మఱి బయలుదేరెదను. నేను నల్లే యున్నాను' అని యొక చెట్టునీడఁ జేరి, యేనుఁగుల కాలిబురదనుజూచి, సరస్సు దగ్గఱ యుండవచ్చునని తలంచి కొంతదూరము పోయెను. పొదలు కన్పించినవి. ఎట్లో దాటి చివర కచ్ఛోదసరస్సుఁ జేరినాఁడు. చల్లనిగాలి వీచినది. అలసట తీరినది. గుఱ్ఱమునుండి దిగి పల్లమును విప్పినాఁడు. కొలఁదిగా గడ్డి మేసినతరువాత నీటిలోదింపి కడిగి నీరుపెట్టి యొకచెట్టుకడ బంగారుకొయ్యబందము వైచి వదలి చుఱకత్తితో గడ్డికోసి మేపినాఁడు. తానును నీటిలోదిగి, కాలుసేతులు కడిగికొని, నీరుత్రాఁగి, తామరతూడుల నమలి,

యూ జత మాయ మైనది. కొండపై ఱాలు జారుచున్నవి. గుఱ్ఱము పరుగెత్తలేక పరుగెత్తుచున్నది. దానియొడలు చెమటలో మునిఁగిపోయినది. నోటినుండి చొంగపడుచున్నది. చంద్రాపీడుఁడు నట్లే యున్నాఁడు. అతనికిఁ దాను చేసినపనికి విచారము కలిగినది. 'నేనెంత మూఢుఁడను. కిన్నరమిథునము నా కెందుకు? నేను చేయవలసిన పని యేమి? అయ్యో! నే నెంతదూరము వచ్చితిని? ఇంద్రాయుధముపై నెక్కితిని. కిన్నరమిథునముపై నాచూపు. ఎన్నియోజనములో గడచినవి. సువర్ణపురము మన భారతదేశమున కుత్తరపు సరిహద్దు. దానితరువాత నిర్జనారణ్యము. అవల కైలాసమని కిరాతకులు పలికిరి. ఇది కైలాసమే. ఇఁక నేను దక్షిణమునకుఁ బోవలెను' అని గుఱ్ఱమును మఱలించి, మఱల 'ఎండఎక్కినది. మధ్యాహ్నమైనది. పాపము! ఇంద్రాయుధ మలసినది. కొంచెము గరిక మేసినతరువాత నీరు ద్రాగించి మఱి బయలుదేరెదను. నేను నట్లే యున్నాను' అని యొక చెట్టునీడఁ జేరి, యేనుఁగుల కాలిబురదనుజూచి, సరస్సో మడుగో యుండవచ్చునని తలంచి కొంతదూరము పోయెను. పొదలు కన్పించినవి. ఎట్లో దాటి చివర కచ్ఛోదసరస్సుఁ జేరినాఁడు. చల్లనిగాలి వీచినది. అలసట తీరినది. గుఱ్ఱమునుండి దిగి పల్లమును విప్పినాఁడు. కొలఁదిగా గడ్డి మేసినతరువాత నీటిలోదింపి కడిగి నీరుపెట్టి యొకచెట్టుకడ బంగారుకొయ్యబందము నైచి వదలి చుఱకత్తితో గడ్డికోసి మేపినాఁడు. తానును నీటిలోదిగి, కాలుసేతులు కడిగికొని, నీరుత్రాఁగి, తామరతూడుల నమలి,

గీతము పూర్తియైనది. వీణ నచటనుంచి యా కన్యక లేచి ప్రదక్షిణముచేసి హరునకు మ్రొక్కి చంద్రాపీడునికడకు వచ్చినది. 'స్వాగత మతిథికి. ఈ ప్రదేశమున కెట్లు వచ్చితిరి? రండు. అతిథి పూజ నందుఁ'డని యా కన్య పలికినది. చంద్రాపీడుఁ డా సతికి నమస్కరించి 'చిత్త'మని శిష్యునివలె నామెతో నడచుచు 'నే నదృష్టవంతుఁడను. ఈమె నన్నుఁ జూచి మాయము కాలేదు. అడిగినఁ దన కథనుగూడఁ జెప్ప వచ్చు'నని తలఁచుచు నూరడుగులు దాటి యొక గుహ దగ్గరకుఁ బోయెను. అది చెక్కఁబడిన గుహ. అందు శంఖ మయమగు భిక్షాకపాలము, భస్మపు సొరకాయయు నున్నవి. ఆ సతి యాకుదొన్నెతో వాఁగునుండి జలమును దెచ్చి యతిథికి కిచ్చెను. ఆతఁ డామె నిర్బంధమునకు లోఁగి యా యతిథిపూజను స్వీకరించెను. ఆమె యడిగినది. రాజపుత్రుఁడు తన చరిత్రమును వివరించినాఁడు. ఆ కన్య లేచి భిక్షాపాత్ర మును దీసికొని చెట్లక్రింద నిలిచినది. పండ్లు రాలినవి. భిక్షా పాత్ర నిండినది. వాని నతిథికిఁ బెట్టినది. ఆతఁ డింద్రాయుధ మును దెచ్చి పల్లమును విప్పి దగ్గరగాఁ గట్టివైచి వాగులో స్నానమొనర్చి యా పండ్లను దిని యూటనీటి నాచమించి యొకచోఁ గూర్చుండెను. ఆమెయు సంధ్యావిధుల నిర్వర్తించి యాహరించి వచ్చి చంద్రాపీడునికడఁ గూరుచుండినది. 'తల్లీ! నిన్నుఁ జూచినప్పటినుండియు నా కాశ్చర్య మగు చున్నది. అడుగఁదగునా లేదా యను మాట పోయినది. అపరాధమును మన్నింపుము. తా మెవరు? ఏల తమ శరీర మిట్లు తెల్లగా నున్నది? ఎంత వయస్సు? ఏల తపస్సుచేయు

చున్నారు? నాకు దయయుంచి తెలుపఁదగునేని తెలుపుఁడని యతఁడు సవినయముగఁ బ్రార్థించినాఁడు. ఆమె కేమియో జ్ఞాపకము వచ్చినది. కనులనుండి నీరు కారినది. ఊర్పులు వెడలినవి. 'హా' యని వాపోయినది. చంద్రాపీడునకు సంతాపము కలిగినది. ఆతఁడు వాగునుండి దోసిటితో నీరును గొనివచ్చి యామె కందించినాఁడు. అనురోధించినాఁడు. ఆమె కనులను గడిగికొనినది. మొగమును నారచీరతోఁ తుడిచికొనినది. మెల్లగా 'రాజకుమారా! ఎందు కీ పాడుకథ. పాపాత్మురాలి కథ. అయినను నీ యాసక్తి ననురోధింపను. విను'మని యిట్లు పలికినది.

దేవతలలో నప్సరస లొకజాతి. వారి కులములు పదునాలుగు. గంధర్వజాతులు రెండు. గంధర్వజాతులు దక్షుని కుమార్తెలగు ముని-అరిష్ట అనువారివలనఁ గలిగినవి. వారిలో మునికొడుకు చిత్రరథుఁడు, చిత్రసేనుఁడు మొదలగు పదునైదుగురు సోదరులలోఁ గడపటివాఁడు-గుణవంతుఁడు-శూరుఁడు-ధార్మికుఁడు.ఆతఁడే యాజాతికి నాయకుఁడై హేమకూటమున నివసించుచుండును. ఈ చైత్రరథ మాతని యుద్యానవనము. ఈ యచ్ఛోద మాతఁడు త్రవ్వించిన కొలను. ఈ శివాలయ మాతఁడు గట్టించినది. అరిష్టకొడుకు లార్గురిలోఁ బెద్దవాఁడు హంసుఁడు. చిత్రరథున కాతఁ డాప్తుఁడు. చిత్రరథుఁ డాతని గంధర్వజాతిలో రెండవ తెగకు నాయకు నొనరించెను. ఆతఁడును హేమకూటముననే నివసించును. ఆ హంసుఁడు 'గౌరి' యను నొక యప్సరసను బెండ్లియాడెను. ఆ గౌరి

నిజముగా గౌరి: చంద్రకిరణజాలములవలన నిర్మింపఁబడినది. ఆ దంపతులకే యీ పాపాత్మురాలు జన్మించినది. వారి కీమె యొక్కతియే పుత్రిక. నా రూపమునుజూచి నా తండ్రి నాకు 'మహాశ్వేత' యని పేరు పెట్టినాఁడు. నేను పెరిగితిని. పెద్దదాన నైతిని. విద్యలఁ జదివితిని. విజ్ఞానవతి నైతిని. వివేకవతి నైతిని. యౌవనవతి నైతిని.

వసంతఋతువు వచ్చినది. మావిచిగుళ్ళు మేసి కోయిలలు కో యని యార్చుచున్నవి. తుమ్మెదలు ఝుంకరించుచున్నవి. ఒకనాఁడు నేను మాయమ్మ గారితో నచ్ఛోదమున స్నానముచేయ వచ్చితిని. నేనును నా చెలికత్తెలును వినోదముగా విహరించుచుంటిమి. అంతలో నా కొక పరిమళము వచ్చినది. నా మనస్సు పరవశ మైనది. ఆ పరిమళ మెచట నుండి వచ్చెనో యని పరికించితిని. కొంతదూరము నడచితిని. నా కనుల కొక పుణ్యమూర్తి కనిపించినాఁడు. నూతనయౌవనముతో-విశాలఫాలముతోఁ-జెంపకుఁ జేరెఁడేసి కనులతో - నొంటి జందెముతో - నాషాఢముతో - నా యువకుఁడు స్నానమునకు వచ్చెను. ఆతనివంటివాఁడే మఱొకఁడు దేవతార్చనమునకై పూలఁ గోయుచు, నాతనివెంట నుండెను. ఆతనిచెవిలో నొకపూలగుత్తి యున్నది. దానిపరిమళమే యది.

ఆ తరుణుని జూడఁగానే నా యాత్మ సంచలించినది. ఒక వికారము కలిగినది. పిచ్చిదానివలె నతని వీక్షించితిని. నాకు భయము కలిగినది. ముని శపించునేమో? నే నా ముని

బాలకునకు నమస్కరించితిని. నన్నుఁ జూడఁగానే యా ముని బాలుఁడు వల్లె యయ్యెను. ఆతనికిని వికారము కలిగినది.

నేను మెల్లగా రెండవ మునిబాలుని కడ కేఁగితిని. అతనికి నమస్కరించి 'మునీంద్రా! యీ తరుణతాపసుఁ డెవ్వఁడు? ఈతనిపే రేమి? ఏమి టీ పరిమళించుపూవు? ఏమి పరిమళము!' అని యాతని నడిగితిని. ఆతఁడు శ్వేతకేతు వను ముని స్వర్గమున నుండును. ఆతఁడు రూపమున నలకూబరుఁడు. ఒకనాఁ డతఁడు మందాకినిలో స్నానము చేయుచుండెను. పుండరీకమునను న్న లక్ష్మి యాతనిఁ జూచినది. ఆమెమనస్సు చలించినది. ఆమెకుఁ బుట్టిన పుత్త్రుఁడే యీతఁడు. ఆ దేవి యీతని శ్వేతకేతువున కర్పించినది. శ్వేతకేతు వితనికిఁ బుండరీకమున జన్మించుటచేఁ బుండరీకుఁ డని పేరుపెట్టి పెంచి పెద్దవానినిఁజేసి విద్యల నేర్పించెను. ఈతనిచెవిలో నిది పారిజాతపుష్పమంజరి. సముద్రమథనమున నప్సరసలతో నిది కూడ బుట్టినది. నేఁడు చతుర్దశి. శివపూజకై కైలాసమునకు వచ్చుచుంటిమి. నందనవనము మామార్గమునఁ గలదు. వనదేవత మాకుఁ గాన్పించినది. ఈ పూగుత్తిని గొనివచ్చి నమస్కరించి 'స్వామీ! తమ రూపమునకీ పుష్పము తగినది. సార్థకముచేయు' మని సమర్పించినది. నా మిత్త్రుఁడు స్వీకరింపలేదు. కాని నేనే తీసికొని బలాత్కారముగ నతని చెవిపై నుంచితిని. ఇది కథ' అని యావేదించెను. ఇంతలో నా పుండరీకుఁడు నావైపు మఱలెను. చిఱునవ్వు నవ్వెను. 'ఎందు కింత కష్టము? కావలసిన నీవు తీసికొనవచ్చును' అనుచు నాకడకు

వచ్చెను. చెవినుండి తీసెను. నా చెవిపైఁ బెట్టెను. నాకుఁ బులకాంకురములు వచ్చినవి. ఆతనిచేతినుండి జపమాల జారి పడినది. నేను దానినిఁ బట్టికొంటిని. మెడలో వైచికొంటిని.

ఛత్రగ్రాహిణి నాతో 'అమ్మగారి స్నానమైనది. మీరును స్నానముచేయుఁ' డని పలికినది. నే నెట్లో బయలు దేరితిని. ఆ మునిబాలుఁడును జలించెను. ఆతని సఖుఁడు లేని కోపమును దెచ్చుకొని 'మిత్రమా! నీవంటివాని కిది తగదు. చదువు లేమైనవి? ఉపదేశము లేమైనవి? జపమాల జారినది కూడ తెలిసికొనలేకపోతివి. పోయిన జపమాలపోనీ! మనసు నైన మఱలింపు'మని పల్కెను. ఆతఁడు లేనికోపము నభినయిం చుచు 'నా యక్షమాలను నా కి'మ్మనుచుండ నేను నా మెడ లోని ముత్తెములదండనుదీసి యాతనిచేతి కందించి స్నానమున కేఁగితిని. స్నానము చేసితిని - ఎట్లో యింటికిఁ జేరితిని. నా శరీరమే యింటిలో నున్నది. మనస్సు - మాటలు - ప్రాణ ములు నా మహాత్మునిమీఁదనే యున్నవి.

కొంచెముసేపటికి నా యడపకత్తె తరళిక వచ్చినది. ఆమెయు నాతో స్నానమునకు వచ్చినదే. 'భర్తృదారికా! మనము సరస్తీరమునఁ జూచిన మునిబాలురలో - నీచెవిపైఁ బారిజాతపుష్పము నుంచినయాతఁ డెట్లో రెండవవానిని దప్పించికొని నాకడకు వచ్చి నీసంగతి నడిగినాఁడు. నేనును నీవు హంసునికూఁతుర వనియు, హేమకూటము నివాస మనియుఁ దెల్పితిని. నన్ను బతిమాలినాఁడు. ప్రక్కనున్న తమాలప్రవాళములను బిడిచి యారసముతోఁ దనవల్కల

మును జించి దానిపై వ్రాసి నీ కిమ్మని యీయాకమ్మ నంపినాఁడు' అని యాతరళిక యడపమునుండి యాకమ్మను దీసిచూపినది. నాప్రాణములు లేచివచ్చినవి. నేను చదివికొంటిని.

"తామరతూఁడుల కెనయగు
నీ ముత్తెపుఁదీగ తమక మినుమడిసేయం
గామించి నామనం బో
కామిని ! రాయంచకొదమకై వడిఁ జెదరెన్."

నేనును దరళికయు మేడమీఁదఁ గూరుచుంటిమి. మాకిదే శోకము. సాయంకాలమైనది. ఆకస మెఱ్ఱఁబడినది. కలువలు వికసించుచున్నవి. అంతలో నాఛత్రగ్రాహిణి వచ్చినది. 'భర్తృదారికా! మనము చూచిన మునికుమారులలో రెండవవాఁడు వచ్చినాఁ' డని తెల్పినది. నేను కంచుకి నంపితిని. వారు వచ్చిరి. నేను మునికుమారునిఁ బూజించితిని. తరళికను జూచి యతఁడు సంశయించెను. నేను సంగతిని దెలుపవచ్చునంటిని. "రాజపుత్రీ! యేమని చెప్పను? ఇది మా జాతికే కళంకము. నేను నా మిత్రునిపైఁ గోపించి లేచిపోయితిని. నీవు వెడలిపోయితివి. నేను మఱల నా మిత్రునిపైఁ బ్రేమచేఁ జెట్లలోనుండి జూచితిని. ఆతఁడు కాన్పింపలేదు. నీవెంట వెళ్ళెనా? లేక యేమేని సాసాసము చేసెనా? యని వెదకితిని. కడ కాతఁ డొక పొదరింట నాకుఁ గాన్పించినాఁడు. మనసు లేదు. మాట లేదు. పరవశుఁడు! కామపరవశుఁడు!!

నామనస్సున భయము కలిగినది. ఆతనికడ కేఁగితిని. ప్రక్కనఁ గూరుచుంటిని. తొడపైఁ జేయివైచితిని. 'మిత్రుఁడా! ఏమిది' యంటిని. నామిత్రుఁడు కొంతసేపటికిఁ గనులు తెఱ చెను. 'తెలిసిన కథకు మఱల నడుగనేల' యని యతఁడు పలి కెను. నే నాతనికి నీతులను బోధించితిని. ధర్మములఁ దెలిపి తిని. పుండరీకుఁడు నాచేతిని బట్టికొని 'కపింజలా! ఉపదేశ కాలము గడిచినది. పాము కఱచినది. విష మెక్కినది. కనులు తిరిగినవి. మూర్ఛ వచ్చినది. ఇఁక నీ దయ. నీ యిష్టము వచ్చినట్లు చేయు' మనెను. ఆతనిదశ దుర్భరమైనది. నే నాతనికి శీతలోపచారములఁ జేసితిని. నా యత్నము విఫల మైనది. కట్టకడకు స్నేహితునిప్రాణముల రక్షింపఁదగునని నిర్ణయించుకొంటిని. నీ కడకు వచ్చితి'' నని యా కపింజ లుఁడు పలికెను.

నా కా మాట లానందమును గల్గించినవి. నా కోరిక తీరినదని సంతసించితిని. ఇంతలోఁ బ్రతీహారి వచ్చినది. 'భర్తృదారికా! అమ్మగారు వచ్చుచున్నారు. నీ శరీర మనారోగ్యముగ నున్నదని వారు వినిరి' అని విన్నవించినది.

మునికుమారునకు జనసమ్మర్దమన్న భయముపుట్టినది. ఆతఁడు లేచి, 'రాజపుత్రీ! నీ దయ. రాత్రికూడ వచ్చినది. నా స్నేహితుఁ డెట్లుండునో' అనుచు నామాటను వినిపించు కొనకయే వెడలిపోయెను. మా యమ్మ వచ్చినది. ఏమి పలికినదో? ఏమి చేసినదో! నే నే మంటినో? నాకే

తెలియదు. అమ్మ వెడలిపోయినది. చీఁకటి పడినది. తరళి కతో నాలోచించుచుండఁగనే చంద్రోదయమైనది. నేను మూర్ఛపోయితిని. తరళిక కన్నీరు నించుచుండెను. కొంత సేపటికిఁ దెలివి వచ్చినది. తరళికయుఁ జెప్పినది. నేనును బయలుదేరితిని. నా కుడికన్నదరుచుండెను.

నేనును దరళికయు నుద్యానవనద్వారమునుండి వెడలితిమి. త్రోవపొడుగునఁ బ్రణయవార్తలనే చెప్పుకొనుచు నా యచ్ఛోదతీరమును జేరితిమి. ఏదియో రోదన ధ్వని వినిపించినది. నాగుండె లదరినవి. మేము పరుగెత్తితిమి. కపింజలుఁ డేడ్చుచు విలపించుచున్నాఁడు. నేనును రోదనము సేయుచుఁబరుగెత్తితిని. నన్నుఁజూచి యతఁడుగొల్లుననేడ్చెను. నా కనులకుఁ బుండరీకుఁడు కాన్పించినాఁడు. ఆతని ప్రాణము లప్పుడే పోయినవి!

నేను కన్నీరు మున్నీరుగా నేడ్చితిని. విలపించితిని. మూర్ఛపోయితిని. లేచితిని. ఆతని శరీరమును గాఁగిలించితిని. ఏమి చేసితినో నన్నే నేను మఱచితిని. కపింజలుని పాదముల పైఁబడితిని. తరళికను గాఁగిలించి యార్చితిని.

అని యా మహాశ్వేత తెల్పుచు మూర్ఛవోయినది. చంద్రాపీడుని మనస్సు సంతపించినది. ఆతఁ డామెను బరిజనునివలెఁ బట్టికొని కూరుచుండఁబెట్టి వీఁచుచుఁ దెలివివచ్చునట్లు చేసెను. 'తల్లీ! మఱచిన దుఃఖమును మఱల బయటికి రప్పించితిని. ఇంక నీ కథను గట్టిపెట్టుము. నేను వినఁజాలను. ఎంతఘోరము! ఎట్టికథ!' అని యాతఁడును విలపించెను.

మహాశ్వేత 'రాజపుత్రా! ఈ బాతిగుండె పగులునది కాదు. భయము లేదు. నాఁడే పగులనిది నేఁ డెట్లు పగులును? నాఁడే పోని ప్రాణములు నేఁ డేల పోవును? అయిన నే నేల బ్రదికి యుంటినో తెలుపవలదా?' అని యిట్లు చెప్పెను.

'లేచి కట్టెలు తెమ్ము. చితి పేర్చుము. సహగమన మొనర్తు' నని నేనుతరళికతోఁబల్కితిని. అంతలోఁ జంద్రమండలమునుండి యొక పురుషుఁడు వెడలివచ్చెను. ఆతనిమూర్తి తెల్లనిది. ఆతని లక్షణములు దేవలక్షణములు. ఆతఁ డా పుండరీకుని శరీరమును జేతనెత్తికొని, 'తల్లీ! మహాశ్వేతా! నీవు ప్రాణముల విడకుము. నీపతిని నీవు కలిసికొందు' వని గంభీరస్వరమునఁ బలికి యాకాశమున కెగిరెను. నాకు వింత వేసినది. 'ఏ మిది' యని కపింజలు నడిగితిని. ఆతఁడు నాకుఁ బ్రత్యుత్తరమీయలేదు. 'పాపాత్ముఁడా! నాస్నేహితు నెత్తికొని పోవుచున్నావా?' యని నడుముకట్టుకొని యాతని వెంట నాకసమున కెగిరెను. అందఱును దారకాపథమునకే పోయిరి.

నా కింకను దుఃఖము కలిగినది. తరళిక నడిగితిని. ఆమె, నాకుమాత్ర మేమి తెలియును? ఆతఁ డెవఁడో మహాపురుషుఁడు. దేవతాంశభవుఁడు. వారిమాటలు కలలోకూడ నిజమైనప్పు డిప్పు డేల నిజము కావు? కపింజలుఁడుకూడఁ దప్పక రాఁగలఁడు. ఆతఁడు వచ్చువఱకు బ్రదికియుండవలసినదే' యని పల్కినది. ఆ రాత్రి గడచినది. మఱునాటియుదయమున సరస్సులో స్నానముచేసితిని. ఆ కమండలువు నే పటి

తిని. ఆ వల్కలములనే కట్టితిని. ఆ భిక్షాపాత్రమునే తీసికొంటిని. ఆ యక్షమాలనే పూనితిని. తల్లిని దండ్రిని సమస్తమును వదలితిని. ఈ యీశ్వరుని జేరితిని. తపమునకుం బూనితిని.

నాతండ్రి కీ సంగతి తెలిసినది. ఆతఁడును, మాయమ్మయు వచ్చిరి. విచారించిరి, విలపించిరి. ఎన్నియో చెప్పిరి. ఎన్నియో దినము లుండిరి. విసిగి, వేసారివా రింటికిం బోయిరి. నేను నీ పాడుశరీరమును గ్రుశింపఁజేయుచుఁ దపమొనరించుచున్నాను. తరళికయు నాకడనే యున్నది అని యామె పలికి విలపించెను.

చంద్రాపీడుని కామెచరిత మాశ్చర్య మనిపించినది. 'తల్లీ! లోకములోఁ బ్రేమ కామమునకై. ఆహా! నీ ప్రేమ మద్భుతము. మరణించిననాథునిఁ బ్రేమించితివి. పరిజనులను-బంధుగులను- సౌఖ్యమును- సర్వమును వదలితివి. అమ్మా! రతి తనభర్తమరణింపఁగా బ్రదికి మఱల నాథునిబ్రదికించుకొనలేదా? సావిత్రి సత్యవంతుని బ్రదికించుకొనలేదా? నీ భర్తయు బ్రదుకును. సందేహములేదు. దుఃఖములు రావా? సుఖము నిత్యముకాని దుఃఖము నిత్యమా?' అని యాతఁడు పల్కి యూరడించి నీటినిగొని తెచ్చి యందించెను. ఆమె యెట్లో మొగము కడిగికొనినది.

# 4

సూర్యుం డస్తమించెను. మహాశ్వేత సాయంసంధ్య నుపాసించి వల్కలశయ్యపైఁ గూరుచుండెను. చంద్రాపీడుఁడు సంధ్యవార్చి రెండవశిలాతలమున నాకులతోఁ బ్రక్క పఱచి కొని యందుఁ గూర్చుచుండెను. మహాశ్వేతను జూచి 'తల్లీ! నీ పరిచారిక తరళిక యేదీ?' యని యడిగెను.

'మహాత్ముఁడా! నీతోఁ జిత్రరథుఁడు మాతండ్రికి మిత్రు డని తెల్పితినికాదా! ఆతఁడు 'మదిర' యను నచ్చరను బెండ్లియాడెను. ఆమె మహారాణి యాతనికి. వారి కొకకన్య జనించినది. ఆమెపేరుకాదంబరి. కాదంబరియు నేను నొకచోఁ బెరిగితిమి. ఒకచో నాడితిమి. ఒకచోఁజదివితిమి. శరీరములు రెండు కాని జీవితమొకటే. వయస్సు నొకటే. కాదంబరి నా కథను వినినది. 'నాచెలికిఁ బెండ్లియగుదనుక నేను బెండ్లియాడ నని ప్రతిన పట్టినది. 'తండ్రిచెప్పినను, దైవము చెప్పినను నాశపథమింతే. లేదేని ప్రాణములు వదలుకొందు'నని చెప్పి నది. ఆసంగతి చిత్రరథునకుఁ దెలిసినది. ఆమెకును బెండ్లి వయస్సు వచ్చినది. నాకడకుఁ దల్లి మదిర 'క్షీరోదుఁ' డను కంచుకి నంపినది. నేనును గాదంబరికి బోధింపఁ దరళిక నంపి తిని. ఆమె వెడలిన కొలఁదికాలమునకే తాము దయచేసితిరి' అని చెప్పినది.

రాజపుత్రునకు శిబిరము తలఁపునకు వచ్చినది. వైశం పాయనుఁ డే మనుకొనుచున్నాఁడో! పత్రలేఖ యేమి తలంచు

చున్నదో? నా యనుచరు లే మనుకొనుచున్నారో? అనుకొనుచు నతఁడు నిద్రపోయెను.

తెల్లవాఱినది. సంధ్య యైనది. జాతిపైఁ గూరుచుండి మహాశ్వేత యఘమర్షణసూక్తముల జపించుచున్నది. చంద్రాపీడుఁడును విధులనిర్వర్తించినాఁడు. అంతలోఁ దరళిక వచ్చినది. ఆమె వెంటఁ బదునాఱువత్సరముల కేయూరకుఁ డను గంధర్వబాలుఁడును గలఁడు. ఆమె చంద్రాపీడునిఁ జూచినది. ఆశ్చర్యముతో నాతనిఁ జూచుచు మహాశ్వేతకు మ్రొక్కినది. కేయూరకుఁడు నారూపమును జూచి మన్మథుఁ డేమో యని తలంచినాఁడు.

మహాశ్వేత జపమైనది. ఆమె యడిగినది. తరళిక "భర్తృదారికా! నేను గాదంబరినిఁ జూచితిని. నీపలుకుల విన్నవించితిని. ఆమె కన్నీరుచిలుకుచు నీ వీణావాహకునిఁ గేయూరకునిఁ బంపినది. ఆతఁడే యామెమాటలు చెప్పు' నని పలికినది, కేయూరకుఁడు 'భర్తృదారికా! కాదంబరి ని న్నాలింగన మొనర్చి యిట్లు పలుకుచున్నది. తరళిక చెప్పినమాటలు నీ వనినవా? నాతల్లిదండ్రుల నిర్బంధమా? నామనసును బరీక్షించుటా? ఇంటిలో నుంటినని కోపమా? నీ కేల మతిపోయినది. సామాన్యులే సఖీదుఃఖమును సహింపలేరే! నే నెట్లు సహింతును? నానమస్కారము నందుము. నన్ను మందలింపకుము. కలనైన నిట్టిపలుకు పలుకకు'' మని పలికి యూరకొనెను. మహాశ్వేత చాలా సే పాలోచించినది. కడకు "నేనే

వత్తు'' నని వాని నంపినది. చంద్రాపీడునితో "రాజపుత్రా! హేమకూటము హేమకూటమే. చిత్రరథరాజధాని చిత్రమైనది. అందమైనది గంధర్వజాతి. కాదంబరి సరళహృదయ. శ్రమములేకున్న - నామాటపై నాదరమున్న - నాయందు దయయున్న-నొకనాఁ డచట నుండి, తెల్లవారఁగనే బయలు దేరవచ్చును'' అని పలికెను. ఆతఁడు "మీయిష్టము. మీయిష్టమువచ్చిన ట్లానతీయవచ్చు'' ననెను. వారు బయలుదేరిరి. హేమకూటమున కేఁగిరి. రాజభవనమును జేరిరి. అంతఃపురమునఁ బ్రవేశించిరి. కాదంబరినివాసమును జొచ్చిరి. కన్యకాజనమధ్యమున నుండి కేయూరకునితో మాటలాడుచున్న కాదంబరినిఁ జూచిరి. చంద్రాపీడుఁ డామెసౌందర్యమున కచ్చెరువడెను. కాదంబరియు నాతని మన్మథుఁడా యని తలంచెను. ఎట్లో లేచినది. మహాశ్వేత కెదురుగా నడిచినది, మెడపైఁ జేతులు వైచినది. మహాశ్వేతయు నామెను గౌఁగిలించుకొని 'చెలీ! భారతవర్షమునఁ దారాపీడుఁడను రాజేంద్రుఁ డుజ్జయిని నేలును.ఆతనిపుత్రుఁడే యీ చంద్రాపీడుఁడు. విజయయాత్రచేసి నాకడకు వచ్చినాఁడు. ఆతనిగుణము లాతని నాకు బంధువునుగా నొనర్చినవి. నీవుకూడ మానవలోకముపై బ్రహ్మ కెట్టియాదరమో తెలిసికొందు వని నా వెంటఁ గొనివచ్చితి' నవినది. చంద్రాపీడుఁ డామెకు నమస్కరించెను. ఆమె యాతని గ్రీఁగంటఁ జూచినది.చిఱునవ్వు నవ్వినది. ఒడలు విఱచినది. మఱల నమస్కరించినది.

మహాశ్వేతయుఁ గాదంబరియుఁ బర్యంకమునఁ గూరుచుండిరి. పరిజనులు తెచ్చిన బంగారుపీటపైఁ జంద్రాపీడుఁడు

గూరుచుండెను. కాదంబరి మహాశ్వేతపాదములఁ గడిగినది. 'మదలేఖ' చంద్రాపీడునిపాదములఁ గడిగినది. కుశలప్రశ్నము లైనతరువాత కాదంబరితో మహాశ్వేత 'మనమందఱ మారాధింపఁదగినది రాజపుత్రుఁ' డనఁగాఁ గొంతసేపటికి సిగ్గుతో మహాశ్వేతను జూచుచు రాజపుత్రునకుఁ దాంబూలమిచ్చినది. ఆమెచేతినుండి రత్నవలయము జాఱినది. ఆమె చూడలేదు. మఱొకతాంబూలము మహాశ్వేత కిచ్చినది. వారు చిలుక పలుకులు వినుచుండిరి. కంచుకి వచ్చినాఁడు. మహాశ్వేతతోఁ 'ప్రభువు చిత్రరథుఁడును రాణి మదిరయు నిన్నుఁ జూడఁగోరి పిలుచుచున్నా' రనిపలికినది. రాజపుత్రునకుఁ బ్రమదావనమునఁ గ్రీడాపర్వతముప్రోల దివ్యభవనమున బస నేర్పఱిచిరి. అది కాదంబరిమేడకడనే యున్నది. కేయూరకుఁడు రాజపుత్రు నట నిల్పి యాతనివినోదమునకుఁ గావలసినపరికరములఁ జేకూర్చెను. కొంతవినోదమయినతరువాత నతఁడా క్రీడాపర్వత శిఖరము నెక్కెను. కాదంబరికూడ మహాశ్వేతకొఱ కెదురు చూచుచున్నట్లుతనమేడకిటికీనుండి యాతనినాలోకింపఁ దొరకొనెను. ఆమెమనసు మనసులో లేదు. పరిజనుల నంపినది. మదలేఖను గౌఁగిలించినది. తమాలికపైఁ జేతులు వైచినది. అంతలో మహాశ్వేత వచ్చినది. ఆమెనిర్బంధముచేఁ దనప నులఁ జేసికొనినది.

మఱునాఁడు మదలేఖ పరివారముతో ధవళాతపత్రముతోఁ జామరములతో వేత్రహస్తహస్తము గ్రహించి రాజపుత్రునికడకు వచ్చినది. ఆమెవెంటఁదరళికయుఁ గేయూ

రకుఁడును గలరు. రాజపుత్రుఁడు వారల సగౌరవముగ నాహ్వానించెను. వారు నాతఁడును మరకతశిలావేదికపైఁ గూరుచుండిరి. ఆమె లేచి స్వయముగాఁ జంద్రాపీడునకుఁ జందన మలఁదినది. రెండు తెల్లపట్టువస్త్రముల నిచ్చి కట్టించినది. మాలతీమాలల నలంకరించినది. ఒకహారమును జేకొని "కుమారా! నీవు గుణవంతుడవు. నీ గుణములే మమ్ముఁ బరవశులఁ జేసినవి. ప్రీతిపరవశులఁ జేసినవి. యాచకులను జేసినవి. కాదంబరి నీ కీ రత్నహారము నంపినది. ఇది సముద్రమథనమున మిగిలినరత్నము. దీనికి శేషమాణిక్య మని పేరు. దీనిని సముద్రుఁడు వరుణున కిచ్చెను. ఆతఁడు చిత్రరథున కిచ్చెను. ఆతఁడు కూఁతున కిచ్చెను. ఆ కాదంబరి నీ కిది తగునని నీ కర్పించినది. 'ఆ నారాయణునకుఁ గౌస్తుభము తగును. తమ కిదితగు' నని తలఁచియే మహాశ్వేతయు సమ్మతించి పంపినది." అని యాతనివక్షమున నామాలను బంధించెను. చంద్రాపీడుఁడు నవ్వుచు 'మదలేఖా! నీమాటలను మెచ్చవలెను. నామాటనే లేకుండఁ బలికితివి. కాదనుటకుఁగాని యవుననుటకుఁగాని నా కే మధికారము? మే మిపుడు మీగుణములకు దాసుల' మని పలికెను. కొంతఁదిసేపు ముచ్చటలతోఁ గడచినది. మదలేఖ సపరివారముగ వెడలిపోయినది.

కేయూరకుఁ డేతెంచి 'కాదంబరీదేవి వచ్చుచున్న' దని చెప్పెను. చంద్రాపీడుఁడు పీఠమునుండి లేచునప్పటికే యామె మదలేఖచేయిపట్టుకొని వచ్చి పరిజనమువలె నేలపైఁ గూరుచుండినది. రాజపుత్రుఁడు శిలాతలమునఁ గూరుచుండ

వేసెను. కాని మదలేఖతోఁగూడ నల్లే కూరుచుండెను. రాజపుత్రుఁడు వినయముతో మధురమధురవాక్యములఁ బలికెను. మదలేఖ 'మీవాక్యములు మాసఖి కానందమునేగాక సిగ్గును గూడఁ గల్గించుచున్నవి' అని యాతనివృత్తాంతము నడిగి తెలిసికొని, కేయూరకుని జంద్రాపీడునికడనుంచి, స్వభవనమున కేఁగినది. కేయూరకుఁడు పాదములనొత్తుచుండఁ జంద్రాపీడుఁ డారాత్రి హాయిగా నిదురించెను.

సూర్యోదయమైనది. 'నారదపుత్రి మహాభారతమును జదువుచున్నది. చెలులతో- బంధుగులతో- మహాశ్వేతతోఁ-గూరుచుండి కాదంబరి వినుచున్నది. రాజపుత్రుఁడు కాదంబరీదర్శనమునకై వచ్చినాఁ డని విని కాదంబరి యాతని నెదుకుకొని నమస్కరించినది. రాజపుత్రుఁడు ప్రతిప్రణామ మొనర్చి వేదికపైఁ గూరుచుండి కొంతసేపటికి మెల్లగా మహాశ్వేత మొగముచూచి నవ్వినాఁడు. ఆమె యాతని యభిప్రాయము నూహించినది. 'నీ గుణములచేఁ జంద్రాపీడుఁడు చంద్రకాంతమువలె ద్రవించిపోయినాఁడు. చెప్పలేక చెప్పుచున్నాఁడు. వెడలవలయు నని తలంపు. పరివారము - సేన - ఆతనిజాడ తెలియక పరితపించుచుందురు. ప్రేమను మఱవరాదు. సెల విమ్మా' యని కాదంబరితో ననినది. కాదంబరి 'వారిచిత్త' మనినది. గంధర్వబాలురఁ నిరువురఁ బిలిచి 'కుమారుని స్వదేశము చేరువఱకంపిరం' డనినది. చంద్రాపీడుఁడు మహాశ్వేతకు నమస్కరించినాఁడు. కాదంబరికి మ్రొక్కి, 'సెలవు. పరిజనులకథలు వచ్చినప్పుడు చంద్రాపీడుఁ డను మాటను

గూడ సంస్మరింపఁదగు'నని పల్కినాఁడు. బయలుదేరినాఁడు. కాదంబరిమాత్రమే యాతని ననుగమింపనిది. మిగిలినవారెల్ల నాతని ననుసరించి వీడ్కొనిరి. ఇంద్రాయుధమును కేయూరకుఁడు తెచ్చినాఁడు. ఆతఁడు గుఱ్ఱము నెక్కి గంధర్వబాలురతో మహాశ్వేతాశ్రమమునకు వచ్చినాఁడు. అచటనే యాతనిపరివారవర్గ మున్నది. గంధర్వకుమారుల నంపి శిబిరమునఁ బ్రవేశించినాఁడు.

వైశంపాయనుఁడును రాజులును బరివార మాతని నెదుర్కొనిరి. ఆతఁ డా నాఁడంతయు 'కాదంబరి – మహాశ్వేత– మదలేఖ – తమాలిక – కేయూరకుఁ' డనుచు వారికథలనే తెల్పుచుఁ దెలిపినదానినే తెలుపుచు హాయిగా నిదురించెను. మఱునాఁ డుదయముననే కేయూరకుఁడు వచ్చి పాదములపైఁ బడెను. రాజపుత్రుఁ డతని లేవఁదీసి 'కేయూరకా! కాదంబరియు, మహాశ్వేతయు సఖీజనమును సేమమా?' యని యడిగెను. 'తమయాదరణపాత్రములగుటచే వారందఱకు సేమమే' యని తాంబూలమునిచ్చి శేషహారమును దీసి "కాదంబరి ప్రణమించినది. మహాశ్వేత యాశీర్వదించినది. పరివారము సేవించినది. మహాశ్వేత తమతో 'నీదర్శనముచే మాదేశమే పవిత్రమైనది. నీ గుణములచేఁ జందమామ జ్ఞాపకమువచ్చుచున్నట్లే నీవియోగముచే సూర్యుఁడు జ్ఞాపకమునకు వచ్చుచున్నాఁడు. కాదంబరియేమియో యస్వస్థగా నున్నది. నిన్నే కలవరించుచున్నది. మఱల నొకపటి దయచేయుము. నీవు ప్రక్కలో మఱచిన శేషహారము నంపితిని. పరిగ్రహింపుము'

అని విన్నవింపుమనిన”దని పలికెను. చంద్రాపీడుఁడు 'మహా శ్వేతాదర్శనభాగ్య మిది'యనియింద్రాయుధముకడకుఁ బరు గెత్తి పత్రలేఖతో దానిపై నధిష్ఠించి వైశంపాయనాదుల నచ్చటనే యుంచి హేమకూటమున దుమికెను. చలిపం దిరిలోనున్న కాదంబరికడ కేఁగఁగనే యామె యాతనికై పుష్పశయ్యనుండి లేచి నమస్కరింప, మహాశ్వేతకు రాజ పుత్రుఁడు నమస్కరించి, బంగారుపీటనావలకుఁద్రోచి నేలపైఁ గూరుచుండెను. కేయూరకుఁడు వారికిఁ బత్రలేఖను బరిచ యముచేయ నామె వారికి నమస్కరింప నాదరించిరి. చంద్రా పీడుఁడు 'దేవిని జూడఁగనే నామనసు చలించినది. ఏమియో తెలియదు? ఈశరీరము దేవిది. ఈతఁ డామెవాఁడు. కామానురూపముగ వినియోగింపవచ్చు'నని సాభిప్రాయముగఁ బలికెను మదలేఖ యందుకొని 'కుమార! ఏమని చెప్పుదుము. ఈమె తాపము దారుణము. కుమారభావోపేతము. ఈ ప్రాణ ములు కుమారదర్శనభాగ్యముననే నిలిచియున్న' వని ప్రత్యు త్తరమిచ్చినది. ఆ దినము గడచినది.

మఱునాఁడు రాజపుత్రుఁడు పయనమగుచుండఁ గేయూరకుఁడు వచ్చి 'పత్రలేఖ నుంపు' మని కాదంబరి ప్రార్థ నమును మదలేఖ తెల్పె నని పలికెను. రాజపుత్రుఁ డట్లే యుంచి శిబిరమునకుఁ దిరిగివచ్చెను.

శిబిరముకడఁ జేరఁగనే యుజ్జయినినుండి లేఖాహార కుఁడు వచ్చినాఁడు. రాజపుత్రుఁడు సేమమడిగి యుత్తరమును

జదివికొని తండ్రివ్రాసినట్లు వెంటనే బయలుదేరినాఁడు. మేఘనాదుఁ డను తన సేనాపతితో నేఁడో ఱేఁపో పత్రలేఖను దీసికొని కేయూరకుఁడు వచ్చును. ఆమెను దీసికొని మీరు రండు. మహాశ్వేతకు నా నమస్కారము లని తెల్పి, 'తండ్రియాజ్ఞచేఁ దప్పక వెడలితి' నని మనవిచేయు మని కేయూరకునితోఁ దెల్పు మని వైశంపాయనునితో మెల్లగా సేనలతో ర మ్మని చెప్పి యింద్రాయుధము నెక్కినాఁడు.

కొలఁదిదినములలో నాతఁ డుజ్జయినిఁ జేరినాఁడు. ప్రజ లాతని నెదుర్కొన నాదరించి, తండ్రికడ కేఁగి గుఱ్ఱము నుండి దిగి యాతనికి నమస్కరించి, పెద్దలకు మ్రొక్కి యథార్థముగ నందఱిని సమ్మానించి, శుకనాసునింటి కేఁగి యాదంపతులకు మ్రొక్కి, వైశంపాయనునికుశలమును దెల్పి 'యాతఁడు స్కంధావారముతో నేతెంచు' నని పల్కి విలాసవతిని దర్శించి, యా తల్లికడ భుజించి స్వభవనమున కరిగెను.

కొన్ని దినములు కడచినవి. మేఘనాదుఁడును బత్రలేఖయు వచ్చిరి. ఆతఁడు పత్రలేఖను గాదంబరివృత్తాంతము నడిగెను. ఆమె మీయం దనురాగముకలిగియున్నది. విరహావస్థలో నున్నదని పల్కినది. ఇంతలోఁ గేయూరకుఁడు వచ్చినాఁడు. కాదంబరిస్థితిని దెల్పి బయలుదేరు మని ప్రార్థించినాఁడు. తల్లిదండ్రులప్రేమ యాతని గదలనీయులేదు.

తల్లియుఁ దండ్రియు నాతనికి బెండ్లిచేయఁ దలఁచిరి. శుకనాసుఁడును సమ్మతించెను. చంద్రాపీడుఁడు కాదంబరినే

పెండ్లాడెద నని సంతసించెను. వైశంపాయనునిరాకయే యాలస్యము.

మఱునాఁ డతఁడు కేయూరకుని బిలిచెను. తనచెవిలోని పూదండ నాతనికిఁబెట్టి యేమియో చెప్పఁదలఁచి విరమించి 'పత్రలేఖా! కాదంబరికి నానమస్కార మని నమస్కరింపుము నాతప్పుల మన్నింపు మనుము. నాజన్మసాఫల్యమునకై - లోకకల్యాణమునకై నేను వచ్చువఱకెట్లో ప్రాణముల నిల్పి కొను మని పలుకు' మని పత్రలేఖతోఁ బలికి, మేఘనాదునితో 'ఓయీ! ని న్నిదివఱకుఁ బత్రలేఖను కొనివచ్చుటకై పంపిన స్థలము జ్ఞప్తియున్నదిగా! నేఁ డచటికే పత్రలేఖను దీసికొని కేయూరకునితోఁ బొమ్ము. నేను వైశంపాయనునిజూచి యచటికి వత్తును. మీరు మహాశ్వేతాశ్రమములో నన్నుఁ గలిసికొని నన్నుఁదీసికొని వెళ్ళవలె' నని వారిని బంపెను.

వెన్నెల వచ్చినది. పండువెన్నెల. రాజపుత్రుఁ డింద్రాయుధము నెక్కినాఁడు. అశ్వసేనతో వెలువడినాఁడు. శిప్రానదిని దాటి 'దశపురమున'కేగుమార్గమున నడచుచున్నాఁడు. తెల్లవారునప్పటికి వారు మూఁడామడలదూరము గడచిరి. తెల్లవారినతరువాత నొకకోసు నడచిరి. అంతలో వారికి స్కంధావారము కలిసినది. చంద్రాపీడుఁడు వైశంపాయనునికిఁ దెలియకుండునట్లు ప్రవేశింతునని రాజచిహ్నముల వదలి రాజపుత్రులనాపి తలకుత్తరీయమును ముసుఁగువెట్టి శిబిరమునఁ బ్రవేశించెను. 'ఎచట వైశంపాయనుఁ'డని యడిగెను. స్త్రీలు కొందఱాతని గుఱితింపలేకయుఁ బనితొందరవలనను 'వైశంపా

యను నడుగుచున్నావా' యనికన్నీరుకార్చిరి. "ఏమంటిరి?" అని కసరుచు శిబిరములోని కేగెను.

ఇంద్రాయుధమునుబట్టి రాజపుత్రుఁ డని రాజకుమారులు గుర్తించిరి. వారు నమస్కరించిరి. చంద్రాపీడుఁడు 'వైశంపాయనుఁ డేఁడీ?' అనెను. వారు 'చెట్టుక్రిందికి దయ చేయుఁడు.మనవిచేసెద'మనిరి. ఆతనిగుండెలుపగిలినవి.గుఱ్ఱము నుండిజారినాఁడు. రాజులాతనిబట్టికొని తివాచీపై గూర్చుండఁ బెట్టిరి. ఆతఁడు దుఃఖపడుచు "నేను గదలఁగానే యుద్ధ మేమయిన నయినదా? ఏమైన వ్యాధి యసాధ్యమైనది వచ్చినదా? ఏల యిట్లయిన" దని యడిగెను. వారు 'రామ రామా!' యని చెవులుమూసికొని 'యుద్ధము రాలేదు. వ్యాధి పుట్టలేదు. వైశంపాయనునికి నూఱేండ్లాయువు, అనినారు. చంద్రాపీడుఁడు సంతసించినాఁడు. నా యనుమానమే నన్నిట్టనిపించినది. నన్ను వదలి వైశంపాయనుఁ డిట్లుండఁగలఁడా? మఱి యతఁ డేలరాలేదు.? ఆతని వదలి మీ రేల వచ్చితిరి?" అని యడిగెను.

'దేవా! అవధరింపుము. మీరు వెనుకనుండి శిబిరమును దీసికొని జాగ్రత్తగా వైశంపాయనునితోఁ గలిసిరా నాజ్ఞ యిచ్చితిరి. నాటిదినము ప్రయాణసామగ్రి సంపాదించుటకై సరిపోయినది. మఱునాఁడు వైశంపాయనుఁడు 'అచ్ఛోద సరస్సు పవిత్రమైనది. దానిఁజూచి స్నానమొనర్చి సిద్ధాయతనమున శివునిఁ బూజించి పోవుద' మని నడక సాగించెను మేమునాతని వెంబడించితిమి. ఆతఁ డచటికిఁ బోగానే యిటు

పటు దిరుగుచు నొకలతామండపమును సరస్తీరమునఁజూచెను. దానిఁజూడఁగనే యాతని కేదియో వికారము కలిగినది. ఏదియో స్మరణమునకు వచ్చినది. ఏదియో పిచ్చి పుట్టినది. కనుల నీరు కారినది. మేము బతిమాలితిమి. ఆతఁడు మా మాట వినలేదు. కన్నీరు కార్చుచు లతామంటపమునే చూచుచుండెను. మేము నిర్బంధించితిమి. ఆతఁడు లతామండపమునే చూచుచు మీరు మీస్కంధావారముతోఁబొండు' అనినాఁడు. మేము మఱల మందలించితిమి. 'తారాపీడుని మంత్రి శుకనాసుని కుమారుడఁవు, చంద్రాపీడునిమిత్రుఁడవు, ఈ పిచ్చియేమి? నీవురాక తప్పదు. నిన్నువదలి మేము పోమంటిమి, ఆతఁడు కొంచెము పెదవి విఱచి నవ్వి 'యీ మాట నాకుఁ దెలియదా? నన్నేమిచేయుమందురు? నాకేమియో కనుపించుచున్నది. తలఁపువచ్చుచున్నది. భావముకలుగుచున్నది. నాకాళ్ళు కదలుటలేదు. నన్ను మీరు బలాత్కారముగా లాగుకొనిపోయిన నేను బ్రదుకను. ఇచ్చటనున్న బ్రదికెద నేమో? నన్ను భాధింపకుఁడు. మీరుపొండు. నాబదులుకూడ జంద్రాపీడుని వదనమును జూచుచు నాతనిసేవింపుడు' అనెను. మేము 'ఇంత ప్రేమయున్న నీవురారాదా?' అంటిమి. ఆతఁడు 'నేనేమియుఁ జెప్పలేను. నాకు సిగ్గగుచున్నది. నేను రాలేను, మీరు దయచేయుఁ' డనినాఁడు. వెంటనేలేచి లతాగృహములలో, సరస్తీరములలో నేమియోపోయినవానివలె వెదకుచుఁ దిరిగినాఁడు. మధ్యాహ్నమైనది. భోజనమునకుఁ బిలిచితిమి. 'ఈ ప్రాణములు చంద్రాపీడునివి. ఇవిపోయిన నేమి చేయఁగలను? కాని వీనైనంతవఱకుఁ గాపాడెద' నని మునివలెఁ

గందమూలములను భక్షించినాఁడు. మేము నావలభుజించి తిమి. ఇట్లే మూఁడుదినములు పగలును రాత్రియు సమాన ములుగా గడచినవి. మాకు శ్రమలేకుండ యుండవలెనని విసిగి వైశంపాయనుని వదలి మేము బయలుదేరితి' మని వారు చెప్పిరి.

చంద్రాపీడుఁడు 'నే నేమియు నగౌరవపఱుచలేదే! నాయనగారుగాని, తండ్రిగాని, తల్లిగాని, యెవ్వరు నేమియు ననలేదే! మఱి వైరాగ్య మెచ్చటనుండి వచ్చినది? సంసార తాపత్రయమా? జాయాదుఃఖమా? ఏల యీ విరాగము?' అనుచు నాపందిరిలోఁ బ్రవేశించి విచారముతో నారాత్రి నిద్రలేకున్నను గన్నులుమూయక విచారించుచుఁ బరుండెను. కొంతసేపటికి 'వైశంపాయనుని దీసికొనివచ్చుటకు బోయె దను. నన్నుఁదండ్రిగాని, తల్లిగాని, శుకనాసుడుగాని మంద లింపరు వైశంపాయనునితోఁ గలసి కాదంబరికడకుఁ బోయి వత్తు' నని నిశ్చయించుకొని భోజనము చేసినాఁడు. రాత్రి రెండవజామునఁ బ్రయాణమయి తెల్లవారునప్పటి కుజ్జయినిఁ జేరినాఁడు. వైశంపాయనునివార్త ప్రజలలోఁ బడినది. రాజును రాణియు శుకనాసునింటికి వెళ్ళిరని తెలిసి యచటికే పోయి నాఁడు. మనోరమ విలాపముల వినినాఁడు. ఆతని మనస్సు సంచలించుచున్నది. చిట్టచివర కెట్లో ప్రాణముల బిగ్గపట్టు కొని తండ్రికి నమస్కరించి ప్రక్కగా దూరమునఁ గూర్చుండి నాఁడు. తండ్రి 'నాయనా? మీ స్నేహము నెఱుఁగుదును. అయిన నీవిషయమున నా కనుమానము కలిగినది' అనెను.

శుకనాసునకుఁ గోపమువచ్చినది. రాజుతో 'ప్రభూ! చంద్రు నికి వేఁడి యుండవచ్చునుగాని, యువరాజునకు దోసముం డునా? వాఁడు దుర్మార్గుఁడు - మాతాపితృ ఘాతుకుఁడు - మిత్రద్రోహి - కర్మ చండాలుఁడు. వానికొఱకై రాజపుత్రు నిపై ననుమానమా? వానికిఁ దండ్రిలేఁడు - తల్లిలేదు - రాజు లేఁడు - మిత్రుఁడులేఁడు- మంచిలేదు - చెడ్డలేదు. అట్టివానికిఁ జంద్రాపీడుఁడు చేయునదేమి? రోగములు పుట్టవా? పురుగులు పుట్టవా? అట్లే యీ దుష్టుఁడు పుట్టినాఁడు. మిత్రద్రోహము చేసినాఁడు.' అనుచు రోజుచుండెను. రాజు, 'మీ రెఱుఁగని దేదీ? ఈలోకమున యౌవనవికారమందని దెవరు? వికార మందినవానికి స్థిరత్వముండునా? ఆలోచన లుండునా? అయిన నతనిని జూడలేదు - అతని యభిప్రాయము తెలిసికొనలేదు - కోపించుట యెందులకు? రానిండు - అప్పుడాలోచింపవచ్చు' నని పలికెను.

శుకనాసుఁడు 'తమ యుదారతయే యిట్లుపలికించినది. యువరాజును వదలియుండుటయా' అనఁగానే చంద్రాపీడుఁ డందుకొని 'నా తప్పులేదని నేనుజెప్పెదను. వైశంపాయనుఁడు రాకుండుటకు నేను కారణముకాదు. అయినను నాయనగా రనుచున్నారు. లోకముకూడఁ దలఁపవచ్చును. లోకులు పలు గాకులు. నేను బోకున్న నాతఁడు రాఁడు. ఆతఁడు రాకున్న నాతప్పును దండ్రివిడువఁడు. కావున నన్నంపుఁడు. వైశంపాయ నుని గొనివత్తును.

శుకనాసుఁడు:- రాజపుత్రుఁడు వెడలునఁట? ఆజ్ఞయేనా?

రాజు:- పిల్లవానికిఁ బెండ్లిచేయఁదలంచితిని. ఇంతలో నీ వైశంపాయనుఁడు పానకములోని పుడకయయినాడు,' అనుచుఁ బ్రయాణ ముహూర్తము నిర్ణయించుమనె నతఁడు తల్లిని, మనోరమ, నడిగి శుభముహూర్తమునఁ దల్లిదండ్రులకును, శుకనాస - మనోరమలకును, నమస్కరించి అశ్వసేనతోఁ బ్రయాణమయ్యెను. త్రోవపొడుగున నతని కనేకవిధముల నాలోచనములు తోఁచినవి 'వైశంపాయనునికి మదలేఖను బెండ్లిచేయుదు' నని తలంచెను. పగలును రాత్రియు నవిశ్రాంతిగాఁ బ్రయాణము సాగించెను. కాని యింతలో వానకాలము వచ్చినది. వానలు పడినవి. నదులు పొంగినవి. త్రోవ బురదమైనది, నడకలు సాగలేదు. కోరికలు పెరిగినవి. వానకాలమునఁ గామము వృద్ధియగును.

మూఁడుపాళ్ళ త్రోవ గడచినది. ఇంతలో మేఘనాదుఁ డతని కెదురుపడినాఁడు. నమస్కరించినాఁడు. 'నీవు వైశంపాయనుని జూచినావా? ఆతఁ డేల యట నుండెనో యడిగితివా? ఏమైనఁ జెప్పినాఁడా? తల్లినిగాని తండ్రినిగాని నన్నుఁగాని నిన్నుఁగాని తలఁచునా? చూడఁగా నేపాఱిపోవునా? నిలిచి మాటాడునా?' అని యతఁడు ప్రశ్నించినాఁడు.

'దేవా! తాము వైశంపాయనుని నేనే చూచి వత్తునని నన్నంపితిరి. కావున నాకు వైశంపాయనుని సంగతియే తెలియదు. మీ రింకను రాకుండుటచే వానలకు భయపడి

మీరు రారేమోయని పత్రలేఖ నన్నుఁ దగుమటచే నేను వచ్చుచున్నాఁ'డనని పల్కెను. 'మఱి పత్రలేఖ యేదీ?' యని యడిగెను. 'ఆమె అడ్డంకులు లేకున్న నేఁడో రేఁపో వచ్చు'నని పల్కినాఁడు.

# 6

చంద్రాపీడుఁడు వానలలో నెట్లో యచ్ఛోద సరస్తీర మును జేరినాఁడు. సేనలకు 'మనలఁజూచి యతఁడు పారి పోవచ్చును. అచ్ఛోదము నాల్గు ప్రక్కల ముట్టడింపుఁ' డనెను. తాను పొదలలో- చెట్లలో-చేమలలో-జాగ్రత్తగా వెదకుచు ఎచ్చటను గాన్పింపమిచే బత్రలేఖవలన నాసంగతి తెలిసికొని తొలఁగిపోయెనేమో ? యని 'అయ్యో కాదంబరి కాన్పింపలేదు. వైశంపాయనుఁడు దొరకలేదే' అనుచు మహా శ్వేతకేమైన నీ సంగతి తెలియునేమో?యని అశ్వసైన్యమును దూరముగా నాపి రాజాలంకారములవదలి సన్నని వస్త్రముల ధరించియింద్రాయుధము నెక్కి మహాశ్వేతాశ్రమమున కేగెను. గుఱ్ఱమునుండిదిగి గుహాద్వారమునశిలాతలమునఁ గూరుచున్న యామె కడ కేగెను.

కనుల బాష్పములు కురియుచున్నవి. శరీరము వణఁకు చున్నది. తరళిక యామెను బట్టుకొనియున్నది. చంద్రాపీడున కామెను జూడఁగానే భయముకల్గినది. పాపము! కాదంబరి కేమేని యనిష్టము కలిగెనేమో? యని తలఁచుచు, వచ్చి 'ఏమిది' యని తరళిక నడిగినాఁడు. ఆమె - మహాశ్వేత మొగ మును జూచినది.

మహాశ్వేత గద్గదికతో నిట్టూర్చుచు 'మహాత్మా! నీ కిదివఱలో నొక దుర్వార్తనుజెప్పి విచారము కలిగించితిని. ఇది రెండవది నేను చిత్రరథుని కోరికను దీర్పలేదు. కాదంబరి కోర్కె తీర్పలేదు. నీకోర్కె తీర్పలేదు. అనుచు విచారించుచు మఱలఁ దపస్సుచేయ నిచటికి వచ్చితిని. ఇచ్చట నా కచ్చము నీవయస్సు బ్రాహ్మణతరుణుఁ డొకఁడు కాన్పించినాఁడు. ఆతఁడు నా కడకువచ్చి యేమియో గుర్తించినట్లు-తెలిసినట్లు - జ్ఞప్తివచ్చినట్లు-పిచ్చివానివలె, మదించినవానివలె దయ్యముపట్టినవానివలెఁ జూచుచు 'యువతీ! ఏల యీ పిచ్చితపస్సు. నిన్ను జూడఁగా నాకు విచారమగుచున్నది. ఎందు కీ మలయానిలము:? ఎందు కీ మన్మథుఁడు ? ఎందుకీ చంద్రుఁడు?' అని పల్కినాఁడు.

పుండరీకుని జూచిననాటినుండియే నామనసు మాఱినది. అతనితో నీవెవఁడ వని కాని ఎచటినుండి వచ్చితివని కాని యడుగకయే నేను మఱొకచోటికిఁబోయి దేవతార్చనకుఁ గుసుమములఁ గోయుచున్న తరళికతో 'ఎవఁడో బ్రాహ్మణ బాలుఁడు! ఏమియో పిచ్చిగా మాటాడుచున్నాఁడు. వీని నిటకు రావలదని చెప్పుము. వినక వచ్చిన దాని ఫల మతఁ డనుభవించు ననుచుండఁగనే వినక యతఁడే వచ్చెను. ఒకనాటి రేయి –నడికిరేయి పండువెన్నెలలోఁ దరళిక నిదురించుచుండ నిదురరాక నేనీ శిలాతలమునఁ గూరుచుండి చందమామను జూచుచుఁ, బుండరీకుని గాథను, చంద్రలోక పురుషుని మాటలను, గపింజలునిగతి ఏమైనదో? ఆతఁ డేల రాలేదో?

యనిఁయుఁ దలంచుచు నుంటిని. అంతలో నా పిచ్చివాఁడు కాన్పించినాఁడు. ఆతని జూడఁగానే నాకు భయమైనది. అనుకున్నట్లే యాతఁడు నాకడకు వచ్చినాఁడు. చంద్రముఖీ! నన్ను మదనుఁడును, జంద్రుఁడును జంపుచున్నారు. నీ పాదములే నాకు దిక్కు. రక్షింపుమా?' యనిపల్కినాఁడు నాకు. గోపము వచ్చినది. 'పాపాత్ముఁడా! చిలుకపలుకులు పలుకుచున్నావా? స్వపక్షమాత్రవృత్తివైతివా? వదనరాగమును జూపితివా? పో! చిలుకవైపో; నావంటివారి జోలికిరాకు' మని పలికితిని. దోసిలియొగ్గి చంద్రునికై చూచుచు 'పరమేశా! నేను బుండరీకునిదప్ప మఱొక పురుషుని గనులెత్తి చూడకుంటినేని, యీ దుష్టుఁడు చిలుక యగుఁగాత! మని పల్కితిని. అంతలోనే యతఁడు నా మాటవలననో, ఆతని వ్రాఁత వలననో, కామము వలననో, కర్మము వలననోకాని మొదలు నరికిన చెట్టువలె నేలపైఁ బడినాఁడు. ప్రాణములు పోయినవి. తరువాత కొందఱు పరిజనులు వచ్చి విలపించిరి. ఆతఁడు నీ మిత్రుఁడని తెలిసికొంటిని.' అని లజ్జతోఁ దలవంచి కన్నీరు నించినది.

ఆమాటలతోఁ జంద్రాపీడుని దృష్టి చెదరినది. మాట రాలేదు. 'తల్లీ! నీవెంత యత్నించినను గాదంబరి లభింపలేదు. ముందుజన్మముననైన నీయనుగ్రహము ఫలించుఁగాక!' యనుచుండఁగనే యతని జీవితము పోయినది. 'అయ్యో! అమ్మా! చంద్రాపీడుఁ డెట్లోయున్నాఁడు. కనులు మూతఁపడినవి. లోపలికిఁ బోయినవి. ఊర్పులు లేవు. 'అయ్యో, చంద్రా

పీడా! చంద్రాకృతీ! కాదంబరీనాథా!' యని వాపోవుచు మహాశ్వేత తలవంచి చంద్రాపీడుని జూచుచుండెను. అయ్యో! పాపాత్మురాలా! తారాపీడునికొంప నాశనము చేసితివా? ప్రజలను బాధచేసితివా? తల్లీ! మారాజపుత్రుని బ్రదికింపుము? అని పరిజనమును రాజపుత్రులును విలపించుచుండిరి. ఇంద్రాయుధము కనులు తెఱచి చంద్రాపీడుని జూచి దీనతరముగ సకిలించి, నేలపై నాలుగుగిట్టల రాయుచు బంధమును దెంపి కొనఁ బ్రయత్నించుచుండెను. ఇంతలోఁ గాదంబరి మహాశ్వేత దర్శనమను పేరితోఁ జంద్రాపీడ దర్శనమునకై కొలఁది పరిజనముతోఁ బత్రలేఖ చేయిపట్టుకొని వచ్చెను. ఆమె చంద్రాపీడుని జూచినది. మూర్ఛపోయినది. మదలేఖ యామెను బట్టుకొనినది. పత్రలేఖ కాదంబరి చేయి వదలినది. ఆమె నేలపైఁ బడినది.

మదలేఖ కాదంబరితో 'తల్లీ! దుఃఖపడిన లాభమేమి? తల్లిని దండ్రిని గాపాడఁదగును. వారికి దిక్కులేదు.' అని పాదములపైఁబడి వేడినది. కాదంబరి నవ్వుచు 'పిచ్చిదానా? ఱాయి పగులునుగాని వజ్రముపగులునా? నా కెట్టిభయమును లేదు. బ్రదుకువారికి బంధుగులుగాని నా కెందులకు? నానాథునికి నేను గన్నీరువదలి స్వర్గయాత్ర కమంగళము చేయను? నీడవలె నాతని యనుగమింతును. నామీఁద నీకుఁ బ్రేమమున్న నాక్షేమమునుఁగోరిన నాతల్లికిని నాతండ్రికిని జీవితాపాయము లేకుండఁ జేయుము. నా యింటి ముంగిట సహకారమునకును మాధవీలతకును వివాహము చేయుము. నా సొమ్ములను

బ్రాహ్మణులకు దానమిమ్ము. చంద్రాపీడుని గౌఁగలించుకొని ప్రాణముల వదలెద నని పలికినది. మహాశ్వేతతో 'నీ కేదియో యాశ యుండుటచే నీ విట్లు తపించుచున్నావు. నా కదియు లేదు. మఱల మనము జన్మాంతరమునఁ గలిసికొందు'మనిపలికి శిరసుచేఁ జంద్రాపీడుని చరణములఁ బూజించి తొడపై నుంచుకొనినది. అంతలో నా శరీరమునుండి యొక చల్లని మూర్తి వెలువడినది. ఆకసములోనుండి యొక దేవవాణి వినిపించినది. 'తల్లీ ! మహాశ్వేతా! పుండరీక శరీర మింకను నా లోకములో నెప్పటివలెనేయున్నది. ఇది నా శరీర మమృతమయము. ఇది యెన్నటికిని నశింపదు. కాదంబరీ స్పర్శచే నసలే నశింపదు. శాప దోషముచే నిట్లున్నది. యోగి శరీరమువలె నిది శాపాంతమువఱకిట్లే యుండును. దీని నేమియుఁ జేయక జాగ్రత్తగా కాపాడవలయును. సమాగమ మగును.' ఆ మాటలతో వారల కాశ్చర్యము కలిగినది. ఆకసమును జూచుచుండిరి. అంతలోఁ బత్రలేఖకు దెలివి వచ్చినది. దయ్యము పట్టినట్లు పరుగెత్తి పరిచారకునిచేతినుండి యింద్రాయుధమును లాగి 'నాథుఁడులేక నీవిట నెందు'కని యచ్ఛోద సరస్సున నా గుఱ్ఱముతోఁగూడ పడినది.

# 7

కొన్ని నిమిషములు గడచినవి. అచ్ఛోదసరస్సునుండి యొక మునిబాలుఁడు వెడలివచ్చినాఁడు. మెడలో నొంటి జన్నిదము కలదు. జటాకలాపము మొగముపైఁ బడుచుండఁ బైకిఁ ద్రోయుచుఁ గన్నీటిని గార్చుచు నాతఁడు మహాశ్వేత యంతికమునకరిగి గద్గదస్వరముతో 'గంధర్వరాజపుత్రీ! నన్ను మఱచితివా? ' యనెను. ఆమె నమస్కరించి 'ఓహో కపింజలుఁడవా? ' యనెను. 'నే నిట్లే యొండిబ్రదుకు బ్రదుకుచున్నాను – నీకుఁగూడ నాపై దయలేదు. ఎంతకాలమైనది? వార్తయైనఁ జెప్పకపోయితివి. నానాథుఁడేఁడీ? ఒంటరిగనే వచ్చితివేఁ?' యనినది. కాదంబరి పరిజనమును జంద్రాపీడ పరిజనము నాశ్చర్యముతో నతనిఁ బరికించుచున్నది. ఆతఁడు 'రాజపుత్రీ! నీకు జ్ఞప్తియున్నదికాదా? నేను నిన్నువదలి నీ దీనాలాపముల వినక 'నా మిత్రుని గొనిపోయెదవేల?'యనుచు నాకసమునకెగిరితిని. ఆతఁడు నాతోమాటాడకయే యాకాశ మార్గమునఁ బోయినాఁడు. నేను నాతని వెంబడించితిని. నక్షత్రమండలము దాటి చంద్రలోకమున కేఁగితిమి. అచట మహోదయమను సభలోఁ జంద్రకాంత శిలా పర్యంకమున నా మిత్రుని కళేబరము నుంచి యతఁడు కపింజలా! నేను జంద్రుఁడను. నాయుదయము లోకాను గ్రహమునకు. నా విధిని నేను నిర్వర్తించు చుండ నీ మిత్రుఁడు నన్ను శపించినాఁడు. నావలెనే నీవును భారతవర్షమునజన్మింపుము. జన్మజన్మముల భార్యా సౌఖ్యములేకయే

దుఃఖించుచునే మరణింపుము' అనినాఁడు. నాకును గోపము వచ్చినది. అకారణ శాపముచేఁ గోపించి 'నాతోపాటు నీవును బాధపడు మంటిని. కోపము పోయి 'మహాశ్వేత నా కిరణముల వలనఁ బుట్టిన యప్సరఃకన్య యగు గౌరి పుత్రి' యని తలఁచి ఎట్టులైన రెండు జన్మముల నాతో సమముగ బాధపడవలెనని తలఁచి యంతవఱకీ శరీరము నశింపరా దనికొని వచ్చితిని. మహాశ్వేత నూరడించితిని. ఈ సంగతిని శ్వేతకేతునకుఁ జెప్పుము. ఏదైన నతఁ డుపాయమున్న శాపములఁ దప్పింపఁ గలఁడని పలికి నన్నంపెను. నేను మిత్రుని వదలి దుఃఖముతో వచ్చుచుండఁ ద్రోవలో నొక విమానమును దప్పించుకొని వచ్చితిని. ఆ వైమానికుఁడు కోపముతో 'గుఱ్ఱమువలె నెగిరితివి. గుఱ్ఱము కా' యని శపించెను. నే నాతనికి మ్రొక్కి నా యాపదను వివరించితిని. ఆతఁడు దయతో నీ యజమానుఁడు మరణింపఁగనే నీ శాపము తీరు ననెను. 'అయిన నా ప్రియవయస్యునితోడను జంద్రునితోడనుఁ నన్నెడ బఱుపకు మంటిని.' ఆతఁ డించుక యాలోచించి చంద్రుఁ డిపు డుజ్జయినీ రాజు తారాపీడునకుఁ గుమారుఁడై పుట్టును. ఆతని మంత్రి పుత్రుఁడై నీ మిత్రుఁ డుదయించును. నీ వా చంద్రాంశ భవుని రాజపుత్రుని సేవింపుమనెను. అంతలో నే నాకసము నుండి సముద్రములోఁ బడితిని. నాకుఁ బూర్వజన్మస్మృతి కలదు. నేనే రాజపుత్రుని కిన్నరమిథునము వెంట నీకడకుఁ దెచ్చితిని. చంద్రాపీడుఁడే చంద్రుఁడు. వైశంపాయనుఁడే పుండరీకుఁ' డని తెల్పెను.

మహాశ్వేత దుఃఖించినది. అశ్రువులు ప్రవహించినవి. అయ్యో! పుండరీకుఁడా! నీకు రూపము మాఱినను ప్రేమ మాఱలేదా? అజ్ఞానముచే నా రత్నమును ఆయియని పాఱ వైచితినని విలపించినది. కపింజలుఁడు 'రాజపుత్రీ! ఇందు నీ దోసమేమి! మఱియు నిది సంతోషకాలముకాని దుఃఖకాలము కాదు. నీవు తపము చేసితివి. పార్వతి తపముచేఁ బరమేశ్వరుని బడయలేదా? అర్ధాంగి కాలేదా? నీవు నట్లే యగుదువు' అని పలికెను. కాదంబరి 'పత్రలేఖ సంగతి చెప్పలేదే? ఆమె కూడ నీతో నచ్ఛోద సరస్సునఁ బడినదిగదా!' యనినది. కపింజలుఁడు 'నా కామెసంగతి తెలియదు. శ్వేతకేతువునకుఁ దెలియనిదిలేదు. ఆతఁడు దివ్యదృష్టికల మహాముని. ఆతని నడిగెద'నని యాకసమున కెగిరెను.

మహాశ్వేతయుఁ గాదంబరియు నాలోచించుకొనిరి. చంద్రాపీకుని శరీరమును ఎండ – వాన – ఈదురుగాలి తగలని యొక ప్రదేశమున నుంచిరి. కాదంబరి యామూర్తి నారాధించుచు నాదిన మభోజనముగఁ గడిపినది. మఱునాఁ డుదయమున నామూర్తి సజీవమువలెఁ గాన్పించినది. కపింజలుని పల్కులు సత్యములని నమ్మకము కలిగినది. తల్లికిని దండ్రికి నీ వృత్తాంతమును దెలుప మదలేఖ నంపినది. వారు 'తల్లీ! నీ నాథుఁడు చంద్రుఁ డగుట మా కానందము. ఆతనితోడనే యుండుఁ'డమ్మని వారు కబురంపిరి.

మఱునాఁ డుజ్జయినినుండి మేఘనాదుఁడువచ్చినాఁడు. ఆతనికిఁ గాదంబరి జరిగిన పరిస్థితులఁ దెల్పినది. త్వరితకు

నతఁడు రాజుకడకంపినాఁడు. రా జావార్తవిని విలపించినాఁడు. రా జొక్కఁడేమి ? దేశమే విలపించినది. కడకు శాపవృత్తాంతము తెలిసినది. శుకనాసుఁడు 'ఎంతమందికి శాపములు రాలేదు. వారలు శాపాంతమున సుఖంపలేదా ?' అని ధైర్యము చెప్పెను,

రాజును మంత్రియుఁ బరివారమును సకుటుంబముగా బయలు వెడలిరి. మహాశ్వేత యాశ్రమమున కరిగిరి. చంద్రాపీడుని శరీరము నాలోకించిరి. వారిని జూడఁగానే కాదంబరి దుఃఖించినది. మూర్ఛపడినది. విలాసవతి యామెను గౌఁగలించినది. లేవదీసినది. చంద్రాపీడుని బ్రదికించినది నీవనినది. చంద్రాపీడుఁడనుమాట చెవిఁబడఁగానే కాదంబరి లేచినది. వారికి మ్రొక్కి-యాశీర్వాచనములనందినది. ఆ రాజు ఆమెనేతన కొడుకని ముద్దిడి 'నిన్నటివఱకు నీవెట్లు నాకుమారు నర్చించితివో నేటినుండియు మాయెదుటఁగూడ నట్లేయర్చింపఁదగును. సిగ్గుపడరాదు. నీ స్పర్శమే యతని కమృత'మని పల్కి యొక యాశ్రమప్రాంత శిలాతలముననుండి పరివారముతో 'కొడుకు నకును గోడలికిని భారమప్పగించి నే నే యాశ్రమపదముననో తప మొనర్పవలెనని తలఁచితిని. నా కోరిక నిప్పుడే తీర్చుకొందును.' అని పల్కి తపో నియమములతో నుండెను. ఆతని దేవియు శుకనాసుఁడును మనోరమయు కాదంబరియు

మహాశ్వేతయు సేవించుచుండిరి. ఆతఁ డనుదినము చంద్రా పీడ మూర్తిని సేవించుచున్నాఁడు.

జాబాలి కథను ముగించెను. హారీతుఁడు మొదలగు వారి నాలోకించి 'మాటలలోఁ బడిపోయితిని. ఈతఁడే యా పుండరీకుఁడు. దేవలోకమునుండి మానవలోకమున శుక నాసుని కొడుకై పుట్టినాఁడు. మఱలఁ జిలుక యైనాఁడు. చేసినవాఁడు చేసిన దనుభవించును. తండ్రి కోపమును మహాశ్వేత శాపము నితని నిట్లు చేసిన'దనినాఁడు.

ఆమాట వినఁగానే నావిద్యలు నాకు జ్ఞప్తి వచ్చినవి. ఒక్క మానవదేహము తప్ప నన్నిటిలో మానవుఁడనైతిని. మఱల నా చంద్రాపీడ స్నేహము,ఆ మహాశ్వేతప్రణయము, ఆ తహతహ పొడమినది. ఱెక్కలేలేవు. జాబాలితో మెల్లగా 'మునీంద్రా ! మీ వాక్యములచే నాకు విజ్ఞానము కలిగినది. జరిగినదంతయు స్మృతికి వచ్చినది. తెలియుటకన్న నిట్టి విషయము తెలియకుండుటయే మంచిది' అనియంటిని. ఆతఁడు కోపముతో 'ఓరి! దుర్మార్గుఁడా ! ఇంకను నీ కీవ్యాధి పోలేదా? ఱెక్కలురానీ. అప్పుడు న న్నడుగవచ్చు' నని పలి కెను.కొడుకుమునితో 'నీతఁడు మునిబాలుఁడే, ఈకామమేమి? ఈ యల్పాయు వేమి?' అని యడిగెను. ముని 'కామమువలనఁ బుట్టినవాఁడు కామి యగును. ఈతఁడు కామవశయగు స్త్రీకి

జన్మించినాఁడు. అందుచేతనే యల్పాయు వైనాఁడని చెప్పెను. 'స్వామీ! నా కాయు ర్వృద్ధియగు మార్గమే' మని నే నాతని నడిగితిని. ముని 'అది నీకే తెలియునులే' యనెను. అంతలో తెల్లవాఱినది. పక్షుల కలకలము వినిపించి నది. మందమారుతము వీఁచినది. వారు నిత్యకృత్యములకై లేచిపోయిరి.

# ౮

హారీతుఁడు నన్నుఁ దన చేతిమీఁద నెక్కించుకొని తన పర్ణశాలకుఁ దీసికొనిపోయి వేదికకడ నుంచి ప్రాభాతిక కృత్యములకై వెడలెను. నేను 'అయ్యో! మానవత్వము పోయినది. బ్రాహ్మణజాతి నశించినది. మునిత్వ మూఁడినది. దేవత్వము నాశనమైనది. ఈ పాడుచిలుక జన్మము వచ్చినది. దీనికన్న మరణమే మంచిది. దేవుని కోరికతీరనీ' అని తలపోయు చుండఁగనే చిఱునగవు మోముతో హారీతుఁడువచ్చి వైశంపాయనా! నీ రోజులు మంచివి. ఇదిగో! నీ మిత్రుఁడు కపింజలుఁడు మీనాయనగారికడనుండి వచ్చినాఁడని పల్కినాఁడు.

నే నాతని 'నేఁడీ' యని మెడయెత్తి యడిగితిని. నాయనగారికడ నున్నాడని యాతఁడన న న్నచటికిఁ గొని పోయెను. స్వామీ! నా ప్రాణము లెగిరిపోవుచున్న వంటివి.

ఇంతలో నాదగ్గరకుఁ గపింజలుఁడు రానే వచ్చెను. అతని జడలు రేగినవి. ఉత్తరీయము జారినది. యజ్ఞోపవీతము జారినది. ఆ కసమునుండి వచ్చుటచే నట్లయి యుండును. నే నాతని నెదురుకొన యత్నించితిని. కనుల నీరు గ్రమ్మినది. 'కపింజలా ! రెండు జన్మముల కిప్పుడు కాన్పించి తివి. నిన్నుఁ గౌగలించుకొనుటకు నాకుభుజములా ? నిన్నుఁ గూరుచుండఁబెట్టుటకుగాని నీ పాదముల నొత్తుటకుఁగాని నాకుఁ జేతులా ?' అని నే ననుచుండఁగనే యాతఁడు నన్నుఁ జేతుల నెత్తి గట్టిగా నురమున హత్తుకొని నా పాదములఁ దలపైనుంచి 'ఆవురు'మని యేడ్చెను. నేనేమియుఁ జేయలేక మాటలతో 'నేను వ్యసములలోఁ బడితిని, వ్యసనముల ననుభ వించితిని. నీవు బాలుఁడవైన నీ వ్యసనములఁబడలేదు. ఎందు కీ విచారము ! నాయనగారు సేమమేనా ? నా వార్త విని దుఃఖించిరా ? కోపించిరా ?' అని యడిగితిని. మిత్రుఁడు నన్నుఁ దొడమీఁద గూరుచుండఁబెట్టుకొని హారీత శిష్యుఁడు తెచ్చిన పల్లవాసనమునఁ గూరుచుండి నా మొగమును గడిగి తుడిచియిట్లనెను. మిత్రుఁడా! నీతండ్రిగారు సేమముగనున్నారు. నీసంగతి ముందే వారికి దివ్యదృష్టివలనఁ దెలిసినది. వారు ప్రతిక్రియకు యత్నించుచుండ నేను బోయితిని. నాతోఁ 'గపింజలా ! నీ దిందేమి తప్పున్నది. తప్పంతయు నాదే ! పుట్టగానే యీ యాయుష్కర కర్మ చేయవలసినది. చేయకపోయితిని. ఈ కథ ముగిసినట్టే. నీ విచటనేయుండుము.

ఆతఁడు చిలుకరూపమున నున్నాఁడు. నీవు వెడలిమాత్ర
ముపయోగమేమి ? ఉండు' మనెను. నేటియుదయమున నన్ను
బిలిచి 'నీ మిత్రుఁడు జాబాలి యాశ్రమమున నున్నాఁడు.
ఆతనికి జన్మాంతరస్మరణము వచ్చినది. నా యాశీర్వచన
మును దెల్పి యీ కర్మ కొలఁది దినములలోఁ బూర్తియగును.
జాబాలి యాశ్రమమున యుండు'మని చెప్పుమనెను. మీ
యమ్మయు నట్లే తెల్పినది' అని నా మొలచుచున్న లేఁత
టెక్కలఁ దడివి మనసులో విచారపడెను. నేను 'ఎందుకు నీ
వేడ్చెదవు? మిత్రుడా! నీవు మాత్రము గుఱ్ఱమ వైతివి. పరుల
మోసితివి. కసవు మేసితివి. కళ్ళెమును నమలితివి. కొరడా
దెబ్బలఁ జవిచూచితివి. పల్లమును ధరించితివి.' అని యేమియో
పలుకుచు నా చిలుక జన్మమునే మఱచితిని. మధ్యాహ్నమున
హారీతుఁడు నాకు నా మిత్రునితో యథోచితముగ నాహార
మును బెట్టెను. భోజనానంతర మతఁడు 'నేను శ్వేతకేతువు
దగ్గరకు వెళ్ళెదను. నాయనగారిమాట మఱవక యిచటనే
యుండు' మని పల్కి హారీతుని సెలవడిగి యాకసమున నెగిరి
పోయెను. హారీతుఁడు నాకుఁ సంరక్షణ చేయించుచున్నాఁడు.
కొన్నిదినములలో టెక్కలు వచ్చినవి. ఎగురుశక్తి వచ్చినది.
టెక్క లున్నవి. ఎగురఁగలను. మహాశ్వేత యట్లేయున్నది.
చంద్రాపీడుఁడు నచటనే కలఁడు. ఎన్నాళ్ళీ బాధ? అచటికే
పోయెద'నని యెగురు చున్నట్లే యెగిరి హారీతునిఁ దప్పించు
కొని యుత్తరదిక్కునకుబయలుదేరితిని. నా కింకనుబూర్తిగా

శక్తి రాలేదు. ఱెక్కలు నొప్పిపుట్టుచున్నవి. ముక్కెండినది. నిట్టూర్పులు వెడలినవి. ఎట్లో సరస్తీరమున నున్న నేరేడు చెట్టుపై వ్రాలితిని. చెఱువులో నీరు త్రాగితిని. పండ్లను నమిలితిని. సాయంకాలమున మఱల బయలుదేరెదనని మఱొక చెట్టు మొదట వ్రాలితిని. అలసటచే నిదురవచ్చినది. కనులు తెఱచునప్పటికి వలలో నుంటిని. నాకనులముందు పాశములు లేని రెండవ యముఁ డుండఁ జూచితిని. ఆతని కనులనుండి నిప్పులు రాలుచున్నవి. జుంజురు వెండ్రుకలు –నల్లనిశరీరము. శరీరమునిండ దుమ్ము. ఆతనిజూచి 'నాయనా ! నీవెవరు ? నన్నేల పట్టికొంటివి. తినఁదలఁచిన నిదురలోనే చంపక పోయితివా ? వేడుకకైన నన్ను వదలుము. నా ప్రాణములు నా చుట్టములమీఁద నున్నవి. నీకును దెలియదా ?' అంటిని. ఆతఁడు 'మహాత్మా ! నేను జాతి చండాలుఁడను. నేను నిన్ను దినుటకుఁగాని వినోదమునకుఁగాని పట్టలేదు. నా రాజు నాజ్ఞ. మా గూడెము రాజిచ్చటనే యున్నాఁడు. ఆతని కూఁతురు పడుచుపిల్ల–ఎవఁడో దుష్టుఁడు జాబాలి యాశ్రమమున మంచి చిలుక యున్నద'ని ఆమె చెవిలో నూరిపోసినాఁడు. ఆమె నావంటివారి ననేకులను నిన్నుఁ బట్టుకొనిరమ్మని పంపినది. నా యదృష్టము మంచిది. నీవు దొరికితివి. ఆమె చిత్తము వచ్చిన నిన్ను విడుచును. లేదా ఖండించును' అనెను నే నెన్నియోవిధముల దుఃఖించితిని. మాలకూడు తిని మాల యింట మాలెతకడ మాటలాడుట ! ఛీ ! ఏమి బ్రదుకు ?'

అని, ఆతనితో 'బుద్ధిమంతుఁడా? నేను జాతి స్మృతికల బ్రాహ్మణుఁడను. నన్నెట్లో రక్షింపుము. నీకుఁగూడఁబుణ్యము వచ్చును. ఇదెవరును జూడలేదు. నీకు నష్టముకూడలేదు.' అనుచు నాతని పాదములఁ బడితిని. ఆతఁడు 'మోహాంధుఁడా! మానవుఁడు చూడకున్న దేవుఁడు చూడఁడా! పంచభూతములు చూడవా? లోకపాలురు చూడరా? నేను నీవంటి వాఁడనుగాను. నిన్ను నా స్వామియొదకుఁ దీసికొనిపోయెద' నని గూడెమునకుఁ గొనిపోయెను.

నన్నాతఁడు పక్కణమునకుఁ గొనిపోయెను. చండాల బాలురు గుంపులు గుంపులుగా వచ్చి నన్నుఁజూచిరి. త్రోవ పొడుగున డొక్కలు. ఎక్కడజూచిన మాంసపుఁగంపు. ఏ యింటఁ జూచిన తోలు చొక్కాలు. అన్నివైపులఁ గల్లు కుండలు. ఎవనినోటఁజూచిన బూతులు. నాకెంతయో వంత కలిగినది. నే నెన్నియో యాలోచించుచుంటిని. ఇంతలో నన్నాతఁడు తన యజమాన పుత్రికకప్పగించినాఁడు. ఆమె నన్నుఁ జేతిలోనికిఁ దీసికొని 'అబ్బాయి! దొరికితివిలే. ఇంక నెక్కడికిఁ బోయెదవు? నీ కామచారిత్వము నణఁగింతునులే' యని పైనఁ బచ్చితోలు పొదిగిన యొక కొయ్య పంజరమున నన్నుంచినది. దానిలోని కొయ్య గిన్నెలో నా కన్నము పెట్టినది. 'ఇఁక హాయిగా నుండు'మని పలికినది.

నాకుఁ గుండెలు పగిలినవి. 'మాటలాడుటవలన నా కీ దశ వచ్చినది. మంచిమాటలు మాటాడితినా, వేఁడితినా,

చచ్చినదనుక నీచెఱ తప్పదు. ఈమెకు నామీఁద ప్రేమ వచ్చుటకు నే నీమె కొడుకునా? కొమ్మనా? మాటాడకున్నఁ గోపించునేమో? ఏమిచేయునో? ఇది క్రూరజాతి. అయిననిచట మాటాడుటకన్న మరణించుటయే మంచి'దని నిర్ణయించుకొంటిని. వారు నన్ను బెదిరించిరి. అదలించిరి. తిట్టిరి. కొట్టిరి. ఏమైన నేమి. నేను బలుకలేదు. మఱునా డామె విచారముఖముతో భోజనకాలము దాటినతరువాత పండని పచ్చికాయలు దెచ్చిపెట్టి 'పశుపక్షులు దొరికినవెల్లఁ దినును. నీవు తెచ్చినవి తినవే. నీవు భోజ్యాభోజ్య వివేకముగల జాతిస్మరుఁడవా? అయిన నీ శరీరము పక్షిది. నీవు మంచిజాతిలోఁ బుట్టితివి. నీచకర్మమువలన నీచుఁడవై పక్షివైతివి. పక్షివలెఁ దినిన పాప మేలవచ్చును?' ఆపత్కాలములలో నందఱియన్నము దినఁదగునని శాస్త్రము లేదా? పండ్లు బ్రాహ్మణుల కొకటియు జం[illegible]లుర కొకటియు లేవే? ఎవరు దెచ్చినను దినవచ్చునే? ఎంపు కి మునిజనులు తిను పండ్లఁదిన'వని పల్కినది. ఆమె మాటలకు నా కాశ్చర్యము కలిగినది. 'ఈమె మునికన్యయేమో? శాస్త్రములు చదివినదే. ఏమైనఁ గోపించి శపించునేమో' యని భయపడి యాహారమును గొంటిని. కాని మౌనమును వదలలేదు.

కొంతకాలము గడచినది. ఒకనాఁటి యుదయమునఁ గనులు దెఱచునప్పటికి బంగారు పంజరములో నుంటిని. ఈ చండాలకన్యక కనిపించినది. ఆ గూడెము స్వర్గమువలె నైనది.

నాకు వింత తోఁచినది. అడుగఁదలచి నోరు తెఱచునప్పటికే యామె యిచట వ్రాలినది.

ఈమె యెవరో! ఏల చండాలవేషమును వేసినదో? ఏల నన్ను బంధించినదో? ఏల యిచటకుఁ దెచ్చినదో? మీ వలెనే నాకును వింతగానున్నది.' అనెను.

రాజామెను బిలిపించెను. ఆమె యాకసముననే నిలిచి 'చంద్రుఁడా? రోహిణీనాథా? కాదంబరీ మనోహరా? ఈ దుర్మార్గునినోట కథనంతయు వింటివికదా! ఇప్పటికిఁగూడా నీ దుష్టుఁడు కామాంధుఁడై తండ్రిమాటను దాటినాఁడు. నే నీతని తల్లిని- లక్ష్మిని, మునీంద్రుఁడు దివ్యదృష్టితో నీ సంగతిసి జూచినాఁడు. పశ్చాత్తాపపడకున్న బాపములు పోవు. ఇటులేయున్న నింక నే దుర్గతి కలుగునో? కావున నితని మానవలోకముననే బంధించియుంచుమని యాదేశించి నాఁడు. ఇతని క్షేమ్యము కలుగుటకై చండాల రూపమున నిలిచితిని. ఇప్పటికిఁ బాపములు తొలఁగినవి. శాపములు మాసినవి. మీరు సుఖము ననుభవింపఁదగును. ఈ మానవ శరీరమును వదలి దేవశరీరమును దాల్పుఁ'డనుచు నాకసమున కెగిరినది,

ఆ మాటలు వినఁగానే శూద్రకుని మనమునఁ గాదం బరిపైఁ బ్రేమ కలిగినది. ఊర్పులు తగ్గినవి. శరీరము వడఁకి నది. కనుల నీరుచిందినది. పెదవి యెండినది. తాంబూలము జారినది. మూర్ఛవచ్చినది. ప్రాణములు పోయినవి. చిలు కయు నట్లే మరణించినది.

# 9

వసంతఋతువు వచ్చినది. మలయానిలము వీచినది. కోయిలలు కూసినవి. తుమ్మెదలు ఝుంకరించినవి. కాదంబరి సాయంతనమున స్నానము చేసినది. మదనుని బూజించినది. చంద్రాపీడుని మేనునకు స్నానము చేయించినది. ఒడలినిండఁ జల్లని గంధము పూసినది. పరిమళించు పూలతో దండలు గ్రుచ్చి తలనిండ నుంచినది. కనులార నామూర్తిని జూచినది. నిట్టూర్పులు వదలినది. ఇటునటు తిరిగినది. మఱల సమీపించినది. తన్మయమైనది. ఆతని గట్టిగాఁ గౌఁగిలించినది. చంద్రాపీడుని విగ్రహము కదలినది. కనులు వికసించినవి. ప్రాణములు వచ్చినవి. కౌఁగిలించిన కాదంబరి నాతఁడుగట్టిగాఁ గౌఁగిలించినాఁడు. ఎప్పటి ధ్వనిలో 'సుదతీ! భయపడకుము. నీ వమృతమునుండి పుట్టిన యచ్చరల బాలికవు. నీ కౌఁగిలి నా కమృతమును బోసినది. నా శాపము తీరినది. బ్రదికితిని. నేను శూద్రకుఁ డను పేర విదిశాపట్టణములోనుండి శాపము ననుభవించితిని. ఈ మానవ శరీరము నీపైఁ బ్రేమమున నుంచినది. ఇఁక నీ విచటనైన నుండవచ్చును. లేదా? చంద్రలోకమున నైన నుండవచ్చును. నీ యిష్టము. నీసఖి భర్తకుఁగూడ శాపము పోయినది ఇదిగో వచ్చినాఁ' డనెను. అంతలో నాకసమునుండి కపింజలునిచేయిబట్టుకొనిపుండరీకుఁడువచ్చెను.

కాదంబరి చంద్రాపీడుని వదలినది. పరుగెత్తి మహా శ్వేతను గాఁగలించినది. అదిగో! పుండరీకుఁ డనినది. అంత లోనే పుండరీకుఁడు చంద్రుని పాదములపై బడినాఁడు.

చంద్రాపీడుఁ డాతనినెత్తి 'మొదటి జన్మమునుబట్టి నా కల్లుఁడవు. రెండవ జన్మమునమిత్రుఁడవు. మైత్రితోనేయుండ వలయుఁజుమీ?' యనినాఁడు. ఈ సంగతినిజూచి కేయూర కుఁడు హేమకూటమునఁ జిత్రరథ హంసులకు వివరింపనేగి నాఁడు. మదలేఖ పరిగెత్తి మృత్యుంజయమును జపించుచున్న తారాపీడుని కీసంగతి తెలిపినది. తారాపీడుఁడు వార్ధక్యముచే వడఁకుచున్న శరీరముతో - మదలేఖతో - శుకనాసునితో - విలాసవతితో - మనోరమతో - వచ్చి - 'ఎచటనున్నాఁడు- ఏఁడీ?' యనుచుఁ - కుమార-వైశంపాయనులఁ జూచి 'ఇదిగో! నా కొడుకు, అదిగో! నీ కొడు' కని శుకనాసునితో ననెను. చంద్రాపీడుఁడు పుండరీకునివదలి రాజు పాదములపైఁబడెను. ఆతఁ డాతని నాదరించి, 'తండ్రీ! నీకు నేను శాపకాలమునఁ దండ్రిని. నిజమునకు నీవు లోకపాలకుఁడవు. నాయందలి వంద నీయమగు నంశమును నీకే యిచ్చితిని. కాఁబట్టి నీవే వంద్యుఁడ'వని యాతని పాదములపైఁ బడెను. తల్లి యాతని ముద్దాడినది. ఆనందబాష్పములఁ దడిపినది. తల్లికడనుండి శుకనాసునికడ కేగెను. మనోరమకు, నాతనికిని, మ్రొక్కి- 'ఇదిగో! మీ కుమారు'ఁ డని పల్కినాఁడు. ఇంతలోఁ గపిం జలుఁడు శుకనాసునితో 'శ్వేతకేతువు మీతో మనవిచేయు

మనినాఁడు, పుండరీకుని నేను బెంచితిని. మీరు కంటిరి. శాపము పోయినను నాకడకు రాలేదు. మీమీదనే యతనికి భక్తి - కాన వీా వైశంపాయనుఁడనియే తలంపఁదగును. చంద్రాపీడుఁ డున్నంతవఱకుండి యీతఁడు నాకన్న నుత్తమ స్థానమునందు' నని చెప్పినాఁ డనుచుండఁగనే పుండరీకుఁడు నమస్కరింప నాతని నాదరించి శుకనాసుఁడు 'ప్రేమ పిచ్చిది. అది యిట్లు పలికించె'ననెను. ఇటులనే మాటలతో నారాత్రి తెల్లవారినది.

గౌరీహంసులును - మదిరా చిత్రరథులును బరివార ములతో వచ్చిరి. మహాశ్వేతయాశ్రమ మొకమహాపట్టణమైనది. వింతలు వినోదములు - మాటలు ముచ్చటలు ప్రతిధ్వనించి నవి. చిత్రరథుఁడు 'పెండ్లి యైనదనుకో, లాంఛనములు జరుగ వలదా ? హేమకూటమునకు దయచేయుఁడు. గృహప్రవేశము చంద్రలోకముననో - యుజ్జయినినో జరుపవచ్చు'ననెను. తారాపీడుఁడు - 'ఎచట సుఖమో యది యే యిల్లు. ఇంత కన్న నానంద మెచట నున్నది? నేను గృహమును వదలి వానప్రస్థుఁడనైతిని. నీవు బాలురతో వెడలు'మనెను. వారలు హేమకూటమున కేఁగిరి. చిత్రరథుఁడు కాదంబరిని రాజ్య మును జంద్రాపీడున కిచ్చెను. హంసుఁడు పుండరీకునకు మహాశ్వేతను దన రాజ్యము నిచ్చెను. పట్టాభిషేకములైనవి.

ఒకనాఁడు కాదంబరి కన్నీరు గార్చుచు ' పత్రలేఖ యేదీ ! అందరును బ్రతికిరి. ఆమె బ్రతుకలేదే ! ఏ మైన'

దని వాపోయినది. చంద్రుఁడు ప్రేమ బాష్పములఁ గార్చుచు 'అది నారోహిణి. నా ప్రేమచే నాశాపమువిని నన్ను సేవింప భూలోకమునఁ బుట్టినది. నాశాపము తీరఁగానే యచ్ఛోద మునఁ బడినది. ఇదిగో!' అని యామెను జూపినాఁడు. కాదంబరి యామెను గౌఁగిలించినది. 'నీవే నిజమైన యిల్లాలి' వని మ్రొక్కినది.

కాదంబరీ - మహాశ్వేతలు తమ నాథులతో సర్వ సుఖముల నందిరి.

చందమామ యుజ్జయినిలోఁ జంద్రాపీడుఁడు. ప్రజా రంజకుఁడగురాజు. కాదంబరి యాతని రాణి! వైశంపాయనుఁ డాతని మంత్రి; ధర్మ- న్యాయ- సంరక్షకుఁడగు ప్రజానియా మకుఁడు. తారాపథమునఁ జందమామ చందమామయే. ఆహ్లాదకరుఁడగు రాజు. రోహిణియుఁ గాదంబరియు నాతని ప్రియపత్నులు - చక్కని చుక్కలు. పుండరీకుఁ డాతని యనుచరుఁడు. చిరకాలము వారు సుఖించిరి.

